భుజంగరాయు, మంత్రిప్రెగడ

# చారుమతీపరిణయము

చెన్నపురము, 1917

Record no. 146

Bhujaṅgarāya, Mantripregaḍa

Cārumatīpariṇayamu

Cennapuramu, 1917

Record no. 146

## Bibliographic Record Target

భుజంగరాయ, మంత్రిప్రెగడ

చారుమతీపరిణయము / ఇది ఆంగ్లమహాకవి షేక్సుపియరు రచియించిన "ఏజ్యులైకిట్" అనునాటకమునకు శ్రీరాజామంత్రిప్రెగడ భుజంగరాయకవి కృతాంధ్రీకరణము. - 1. కూర్పు. - చెన్నపురము : సదానందనిలయముద్రాక్షరశాల, 1917.

130 p. :port. ;18 cm.

Record no. 146

Bhujaṅgarāya, Mantripregaḍa

Cārumatīpariṇayamu / idi āṃglamahākavi Ṣēksupiyaru raciyiñcina "Ējyulaikiṭ" anunāṭakamunaku Śrīrājāmantripregẖaḍa Bhujaṅgarāyakavi kṛtāndhrīkaraṇamu. - 1. kūrpu. - Cennapuramu : Sadānandanilayamudrākṣaraśāla, 1917.

130 p. :port. ;18 cm.

Record no. 146

శ్రీరస్తు.

# చారుమతీపరిణయము.

ఇది

ఆంగ్లమహాకవి షేక్స్పియరు రచియించిన "ఏజ్ యులైకిట్"

అనునాటకమునకు

శ్రీరాజామంత్రిప్రెగడ భుజంగరాయకవి

కృతాంధ్రీకరణము.

మొదటి కూర్పు 1,000 ప్రతులు.

చెన్నపురము :

సదానందనిలయముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడి

గ్రంథకర్తచేఁ బ్రకటింపఁబడినది.

1917.

వెల, 0-12-0.



విలియం షేక్స్పియరు మహాకవి.

శ్రీ

# చారుమతీపరిణయము.

———∞∞———

## నాంది.

శా. భూలోకంబును, నందుఁగల్గుసకలంబున్, సృష్టిగావించి, స
ల్లీల న్మానవు నాధ్యుఁ జేసి, వరబుద్ధిస్వేచ్ఛలం గొల్పి, పా
పాలంబాత్మకుఁ డౌ పైజెంగి, నరుఁడై, యాయార్తిమాన్పించు, భూ
పాలగ్రామణి దేవదేవుఁడు సదా పాలించుతన్ లోకముల్.

## నాంద్యంతమున.

సూత్రధారుఁడు—(సభ్యులపైఁ గుసుమాంజలిం జల్లి) ఆహా! నేఁడు సుదినము. అనవద్యవిద్యాప్రవీణు లగువిద్వద్వరేణ్యులచే నిండియున్న సభారంగమున నాభరతకలాప్రాగల్భ్యమును వెల్లడించి ప్రఖ్యాతిం గాంచు సమయము నేఁటి కాసన్నమైనది. కావున నాప్రేయసిం బిలిచి తదనంతర కార్యము నిర్వర్తించెదనుగాక! (తెరవంకఁ జూచి,) నెచ్చెలీ! నీవొకసారి యిటు రమ్ము.

నటి—(ప్రవేశించి) ఆర్యపుత్రా! నమస్కారము.

సూత్ర—సౌభాగ్యవతీ! ఆయుష్మంతురాలవు కమ్ము.

నటి—ఆర్యా! నీముఖవైఖరిని బరికింప శరత్కాలరాత్రిచే మెఱుంగుపెట్టఁబడిన పూర్ణేందుమండలంబు స్ఫురించుచున్నది. ఇందుల కేదేని క్రొత్తకారణ ముండకపోదు.

సూత్ర—ఆహా! ఏమి నీభావజ్ఞానచాకచక్యము! కాదు కాదు. నేనే పొరపడితిని. నాయర్ధాంగలక్ష్మి వగునీకు నాభావమును గుర్తించుట యెంతవింత! ఔను. కల దొక క్రొత్తముచ్చట.

నటి—ఏమది?

సూత్ర—మనయాంధ్రభాషాయోషామణి పాశ్చాత్యదేశాలంకార ధారణంబుచే మిగులవిరాజిల్లఁగల పుణ్యాహంబులు సంప్రాప్తమైనవి.

నటి—అహా! నూతనాభరణధారణంబు తరుణీమణులకుఁ గుతూహలకారణంబు గదా!

సూత్ర—అదియే నాయానందకారణము.

నటి—ఔఁగాని నీ వెమ్మనంబున వింతఁ గొల్పుచుండు నయ్యలంకార మేమి? మనభాషాయోషామణియందలి గాఢానురాగమును సూచించుచు దీని నుడుగరగా నొసంగినవా రెవరు?

సూత్ర—సీ. లలితగంభీరనిస్తుల భావకల్పనల్
పసమించులతల శిల్పములు గాఁగ
నసమాననవరసోల్లసమానపద్యసం
తతులు సన్నద్ధరత్నములు గాఁగఁ
బటుతరధారాళవాక్యపరంపరల్
జిగిమించుముత్యాలచేర్లు గాఁగఁ
గలితోపమాద్యలంకారసారస్యముల్
రమణీయధాళధళ్యములు గాఁగఁ
గీ. జెలఁగి కనువారికెల్ల విందులొనరించు
నవ్యచారుమతీపరిణయమనంగ
రూఢిమించిన శృంగారరూపకంబు
పల్కనొప్పెడి బంగారు పదక మనఁగ.



నటి—ఆర్యా! దీనినిఁ బాశ్చాత్యదేశాలంకార మని చెప్పుటకుఁ గతం బేమో నాకుఁ దెలియదు.

సూత్ర—సుందరీ! అనేక నాటకగ్రంథరచనా విశారదుం డై జగద్విఖ్యాతమైనకీర్తిచంద్రికచే నలంకరింపఁబడుచుండు "షేక్స్పియ" రనుపాశ్చాత్యదేశకవిశేఖరునిచే రచియింపఁబడిన "ఏజ్ యు లైక్ ఇట్" అనుశృంగార నాటకంబు నాంధ్రీకరించుటచే నట్లు వివరించుటకుఁ గారణమైనది.

నటి—అట్లయిన విదేశీయాచారాదులచే సంపూరితంబయిన యీనాటకంబున నీసామాజికుల నానందపఱచుట కల్ల యనియే తోఁచుచున్నది.

సూత్ర—వెఱ్ఱిదానా! నీ వనుకొనినట్లు కాక యాచారములయందును, నామంబులయందును, ననువుగాని మఱికొన్ని స్థలంబులయందును, నుచితభంగిని గొలఁదిమార్పుల జరిగించి రసవత్తరం బగుకవిహృదయంబుఁ బ్రస్ఫుటింపఁ జేసి యీహిందూసామాజికుల యుల్లంబులు పల్లవించునట్లు రచియింపఁబడి యుండుటచే మిక్కిలి హృద్యముగా నుండును.

నటి—ఇంక నారెండవ ప్రశ్నంబునకు సమాధానము రావలయును.

సూత్ర—అదియే వివరించుచుంటిని.

సీ. ఏమహాత్ముఁడు లోక మెల్ల నౌనని మెచ్చఁ
జాలునీతులు బోధసలిపె నెవని
యాత్మబోధల నెల్ల నాచరించుట మార్గ
దర్శియై యొసఁగె నే ధన్యతముఁడు
ఎవనిజీవితయాత్ర యింతలో నెంచశ
క్యంబుగా నెంతటిఘనున కైనఁ
దనప్రాణములనిచ్చి ధరణి నెల్లరఁ బ్రోచు
ప్రేమ యేఘనుని వరించిమించె
గీ. నట్టి దేవునిపట్టి యైనట్టి ప్రభుని
యేసునామునిఁ గ్రీస్తునా నెసఁగువాని

నూతననిబంధనము నాంధ్రమాత కిడియెఁ
బద్యకావ్యంబుఁ జేసి యే ప్రథితయశుఁడు.

నటి—ఓహో! నా ప్రశ్నార్థంబు వెల్లడింపకయే వాక్యమును ముగించితిరే!

సూత్ర—ప్రేయసీ! వినుము.

మ. వరమంత్రి ప్రెగడాన్వయంబునకు దీపంబై విరాజిల్లుచున్
హరితాభిఖ్యమహర్షిగోత్రభవుఁడై యార్వేలవంశంబునన్
ధరణీనాయకతాసమార్జనలసద్రాజాభిధానాంకుఁడై
కర మొప్పారె భుజంగరాయవిభుఁ డగ్రశ్రీయశోభాసియై.

నటి—బాగుబాగు. ఈకవీంద్రుని కవితాచమత్కారంబును, వర్ణనాతిశయంబును, రసపోషణంబుమున్నగు సద్గుణంబులు మన మెఱుంగనివికావు. కావున నేతన్నాటక ప్రదర్శనంబుచే మన మీసభాస్తారుల నానందపఱుపఁ గుతూహలంబునందుచుంటి.

సూత్ర—ఆర్యురాలా! నీమనఃకౌతూహలంబు వెల్లడించు వసంతగీతామృతంబుచేఁ దొలుదొల్త నానందపఱుపుము.

నటి—చిత్తము.

ఉ. పిన్నతనంబునుండి తనపెంపక మందుననున్న కోయిలన్
మన్ననకెక్కు కంఠరవమాధురిఁ జూచి సహింపలేక మ్రో
ల న్నిలువంగనీక వెడలంగనడంచెను గాక మక్కటా!
యెన్ని విపత్తు లందిన నహీనగుణుల్ చిరకీర్తి నందరే!

సూత్ర—మేలుమేలు! సుందరీ! ఆగతానాగతంబుల నేకీభవింపఁజేసి వెల్లడించిన నీవర్ణనాచమత్కారము మిగుల శ్లాఘ్యమై యున్నది. కావున మనము ప్రస్తుతకార్యము నిర్వర్తింపఁ గడంగుదము.

నటి—మనకుశీలవసమాజము దేవరయాజ్ఞకై నిరీక్షించియున్నది. కావున మనకిదియే కర్తవ్యము. (నిష్క్రమింతురు)

ఇది ప్రస్తావన.

# చారుమతీపరిణయము.

## ప్రథమాంకము.

### 1-వ రంగము.

### ప్రద్యుమ్నుని గృహారామము.

(ప్రవేశము—భీమబలుఁడు, సుమంతుఁడు)

భీమబలుఁడు—సుమంతా! ఈరీతి జరిగెనని నాకు జ్ఞాపకము.

చ. జనకుఁడు వేయికాసుల నొసంగి, సహోదరులోడఁ జెప్పె నీ
యనుజుని సర్వవిద్యల రయంబునఁ బెంపు మటంచు, సౌమ్యుఁడున్
వినుతకళావిశారదతఁ బెంపువహించె మదగ్రజుండు నా
కనయము విద్య నేర్పక గృహంబున నుంచె నను స్సుమంతుఁడా! 6

ఇది విచారకరమైనసంగతి కాదా! మఱియును.

గీ. జనకవాక్పరిపాలనాసక్తి వదలి
వంశమర్యాదలను నేలపాలు సేసి
తెచ్చె నన్నిట్టిదురవస్థ కచ్చుపడఁగ
వృషభమును గోష్ఠమం దుంచి పెంచినట్లు. 7

వానియశ్వములు సైతము నాకన్న మిన్నగాఁ బోషింపఁబడుచుండె. అదియునుంగాక పల్లవపుత్తాదిగమనవిశేషంబులఁ గఱపింప విశేష ద్రవ్యవ్యయంబు గావించి దక్షులైనశిక్షకుల నేర్పరించె. ఈతనిపరిపాలనంబున నేను దేహపుష్టి దక్కఁ దక్కినభాగ్యాదికంబునకు నోఁచనైతిఁ గదా!

చ. ఉరుగతిఁ బాయసాన్నముల నొత్తుగఁ గుత్తుకబంటి మెక్కి త
త్పరిణతరక్తపూరమున బల్పువహించి, నిరర్థక క్రియా
పరత నహర్నిశంబు జరుపంబడె నక్కట! పేఁడకుప్పలో
నిరవగు పుర్వురీతి నిడ నేటికి, నమ్మక మెల్ల భ్రాతపైన్. 8

ఇట్లు దైవదత్తమైన యవయవపుష్టినిం గూడ దృష్టిదోషంబున హరించుచుండె నని తలంచెదను. సహజమైనసౌహార్దంబు నాయం దించుకేని గన్పట్టదు. సేవకావళిలో నన్నొకనిగాఁ జూచుచుండు. ఇట్టిపాలనవిధానంబు నా సహసిద్ధంబైన యాభిజాత్యమునకుం గూడ వేరుపురు వయ్యె. సుమంతా! ఇదియేగదా నావిచారమునకుం గారణము. మఱియు నాయందుఁ బరిణమించిన మాజనకుని సద్గుణసార మీసేవకవృత్తినిఁ దిరస్కరించుచున్నది. తగినతరణోపాయము దోఁపకున్నను దీనిని భరింపఁజాలకుంటి.

సుమం—అయ్యో! భవదగ్రజుండగునాయేలిక యిటులే వచ్చుచుండెను.

భీమ—సుమంతా! అటులైన నీ వీప్రక్క నిలిచి పరికించెద వేని నాతఁడు నన్నెట్లు విదల్చునో వినంగలవు.

(ప్రద్యుమ్నుఁడు ప్రవేశించుచున్నాఁడు)

ప్రద్యు—(తమ్మునింజూచి) ఓహో! తమరా! ఇచ్చట నేమిసేయుచున్నారు?

భీమ—ఏమియునులేదు. చేయుటకు నాకునేర్పిన దేదియు లేదుగదా!

ప్రద్యు—అటులైనఁ జెడుగు సేయుచుంటిరా!

భీమ—దైవముతోడుగాఁ జెప్పుచుంటిని. నీకు సోదరుఁడ ననిపించుకొనుట కనర్హుఁడనై భగవంతునిచే సృజింపఁబడిన నన్ను సోమరితనము పాలుసేయుటయందు నీకుఁ దోడ్పడుచుంటిని.

ప్రద్యు—ఓహో! దేవునితోడా! ఇదియేమితెగులు? యింతకన్న ఘనకార్యమునకుఁ బ్రయత్నింపుము.

భీమ—ఇంతటినుండి నీకుం బసులకాపరినై గడ్డి దిని బ్రదుకుమందువా!

గీ. అకట! యంతటివాని కే నాత్మజుండ
నగుచు నింతటిదురవస్థ ననుభవింపఁ
దలఁప గురుదత్తమైన విత్తంబులోన
నింతదనుకను నెంతవెచ్చించినాఁడ.





ప్రద్యు—తమ రెచ్చట నుంటిరో తెలియునా!

భీమ—అయ్యో! తెలియకేమి! ఏలినవారిగృహారామంబున.

ప్రద్యు—ఎవరియెదుటనో తెలియునా?

భీమ—నాయెదుటనున్నవాఁడు నన్నెఱిఁగినకంటె వాని నేను బాగుగా నెఱుంగుదును. నీవు జ్యేష్ఠభ్రాత వన్నస్పృహ నాకుఁగలదు. నీకుంగల రక్తసంబంధమునుబట్టి నీవు నన్నట్లే గుర్తింపవలసియుండును. నీ వగ్రజుండ వగుటచే సంఘాచారముంబట్టి నాకన్న నున్నతుండ వైతివి. అట్టియాచారమే మననడుమ నింకను బలువురు సహజన్ము లున్నను నాయందలి పైతృకతేజంబునందుఁ గలగౌరవంబునకు క్షీణత్వము నాపాదింపఁజాలదు. నీవగ్రజుండ వగుటచే జనకునివలె గౌరవింపఁదగినవాఁడ వైనప్పటికి జనకుఁడు నీయం దెట్లో యటులే నాయందును నావిర్భవించి యుండెను.

ప్రద్యు—ఆఁ! ఏమది! (అనికొట్టఁ బోవుచున్నాఁడు)

భీమ—అన్నా! రమ్మురమ్ము. ఈవిద్యయందు నాకన్న నీవే కడుఁజిన్నవాఁడవు. (అని కంఠముపైఁ జేయివేయును)

ప్రద్యు—దుర్మార్గుఁడా! నాపైఁ జేయిఁ జేసికొందువుగా?

భీమ—నేను దుర్మార్గుఁడను గాను. విజయభూపతి కనిష్ఠపుత్త్రుఁడను. అతఁడు నాకుఁ దండ్రి. అట్టితండ్రి దుర్మార్గులను గనియెననిపలుకువాఁడు ముమ్మాటికిని దుర్మార్గుఁడు. నీవు నాకు సోదరుఁడవే కాకుండినచో నట్లు పల్కినందు కీరెండవచేతితో నీనాలుక నూడఁబెఱుకువఱకును హస్తమును మెడనుండి తీయకుందును. ఓయీ! న న్నిట్లు పల్కుట నిన్ను నీవే నిందించుకొన్నవాఁడ వగుచుంటివి.

సుమం—ప్రియులైన యేలికలారా! శాంతమును వహింపుఁడు. మీతండ్రిగారిని జ్ఞాపకముచేసికొని సఖ్యమొందుఁడు.

ప్రద్యు—సరే నన్ను పోనిమ్ము.

భీమ—నాచిత్త మగువఱకును నిన్ను విడువను. నేఁ జెప్పునది యంతయు విని తీరవలయును. నాకుఁ జక్కఁగ విద్యఁ జెప్పింపుమని మాతండ్రి మరణ శాసనమున శాసించియుండ గౌరవార్హమ్ము లగుగుణముల నాకబ్బకుండునట్లు చేసి నన్నొక కర్షకునివలెఁ బెంచితివి. నాతండ్రి తేజంబు నన్ను బలవత్తరముగఁ బ్రేరేపించుచుండుటచే దీని నింక భరింపను. కాన యోగ్యతాపాదకమయినరీతిని నన్నుఁ బెంప నిర్ణయము చేయుము. కానిచో గురుదత్త మయిన స్వల్పధనమును నాకొసంగుము. దానిచే నాయదృష్టమును వెదకెదను.

ప్రద్యు—ఏమి చేయుదువు! అది వెచ్చపెట్టినపిదప బిచ్చమెత్తుదువా! బాగు బాగు లోనికిం బొమ్ము. నేనింక నీతోఁ జిరకాలము బాధపడను. నీకోరికలోఁ గొంతవఱకు నెఱవేఱఁగలదు. నీపుణ్యమాయె నన్ను విడువుము.

భీమ—నా క్షేమమునకుఁ గావలయునంతకన్న నధికముగా నిన్ను బాధింపను.

ప్రద్యు—(సుమంతునిఁ జూచి) ఓముదికుక్కా! వానితోఁ గూడ నీవును బొమ్ము.

సుమం—ముదికుక్క యనిపించుకొనుటయేనా నాకు బహుమానము. నిశ్చయముగా నాదంతము లన్నియు మీసేవయం దూడినవి. మాపెద్దదొరకు దైవము తోడ్పడునుగాక! వారెన్నఁడు నన్నిట్లు తూలనాడియుండరు.

(భీమబలుఁడు, సుమంతుఁడు నిష్క్రమింతురు)

ప్రద్యు—అట్టులా! నీవు నన్నుఁ గూడఁ దిరస్కరించుచుంటివిగా! నీగర్వమునకుఁ దగినచికిత్స చేసెదను. గురుదత్తమైన విత్తమునుమాత్ర మిచ్చువాఁడను గాను. ఎవరురా! అక్కడ!

ప్రతీహారి—(ప్రవేశించి) ఏలినవారిసెల వైనదా?

ప్రద్యు—రాజమల్లుఁ డగు—

ప్రతీ—చిత్తము. ద్వారముకడనుండి తమసెలవునకై నిరీక్షించుచున్నాఁడు.

ప్రద్యు—లోనికి రమ్మనుము.



ప్రతీ—(నిష్క్రమించును)

ప్రద్యు—(తలపంకించుచు) ఇదియే మంచిమార్గము. రేపు మల్లయుద్ధము జరగును.

మల్లు—(ప్రవేశించి) దేవరవారికి వందనములు.

ప్రద్యు—మల్లుఁడా! స్వాగతము. క్రొత్తరాజసభలోని విశేషములేమి?

మల్లు—రాజసభయందుఁ గ్రొత్తవింత లేవియును లేవు. అన్నియుఁ బురాతనములే. రాజానుజుఁడు తనయగ్రజుని బురంబు వెడలనడిచి తాను ధర్మాసనం బాక్రమించెను. వెడలింపఁబడిన భూమీశునితో బద్ధానురాగు లైన మువ్వురు నలుగురు సామంతరాజులు బుద్ధిపూర్వకముగా వెడలిపోయిరి. వారిరాజ్యాంశములెల్ల నూతనాధిపతి యధీనము లైనవి. కావుననే వారిని స్వేచ్ఛగా దేశమునుండి తరలి పోనిచ్చెను.

ప్రద్యు—రాజతనూజ యగుచారుమతి తండ్రితోఁ గూడఁ బ్రవాసమునకంపఁబడెనేమో చెప్పఁగలవా?

మల్లు—లేదులేదు. నూతనప్రభుం డైనవిక్రమసేనుని తనయయు నీమెయు బాల్యమునుండియు నేకముగాఁ బెంపఁబడుటచేఁ జారుమతి వనప్రవాసమున కంపఁబడెనేని తనపుత్త్రిక యైన కమల యామెతో వనవాసమున కేగుట గాని, లేక నిర్బంధించినయెడల మరణించుట గాని జరుగునంతటి బద్ధానురాగిణు లై యుండిరి. ఆకారణముననే చారుమతి రాజభవనమందే యున్నది. నూతనప్రభువుగూడ నీమెను దనపుత్త్రికతోఁ దుల్యముగఁ బ్రేమించెను. ఈ నెలంతలకుం గలపరస్పరానురాగ మితరకాంతలయం దెచ్చటను గానిపింపదు.

ప్రద్యు—పురాతనప్రభుం డిప్పు డెచ్చటనుండెను?

మల్లు—వా రిదివఱకే నైమిశారణ్యమునుండి రని కింవదంతి గలదు. వారితోఁ బెక్కండ్రుత్సాహపురుషులు గూడ నేగిరఁట. పూర్వము ధర్మరాజాదు

లరణ్యావాసముఁ జేసినటులు వీరుఁగూడ నుండిరఁట. కృతయుగమునందు వలెనే వారిచుట్టును యువకులు పెక్కండ్రనుదినమును జేరి కాలమును క్షణమాత్రముగా నిర్వ్యాపారులై గడపెదరు.

ప్రద్యు—నవీనప్రభువరుని యెదుట రేపు బాహుయుద్ధపాటవముం గనఁబఱచెదవా?

మల్లు—తప్పక యట్లే చేసెదను. ఈవిషయము తమ కెఱింగించుటకే వచ్చితిని. మఱియు—

మ. భయ మొక్కింతయు లేక భీమబలుఁ డిప్పట్లన్నిగూఢాకృతిన్
రయమొప్పారఁగ రంగభూమి కరుదేరం జూచె, నస్మద్భుజా
ద్వయచూర్ణీకృతశల్యుఁ డౌట కని చెప్పన్వింటి, రాట్సన్నిధిన్
జయభేరి న్మ్రోయింప నెల్లి తఱిగానన్ జాలికిం గాలమే. 10

కావున నంగవైకల్యమును బొందక నాబారినుండి తప్పించుకొనువాఁడు ధన్యుఁడే యననొప్పు. నీయనుజన్ముఁడు లేఁబ్రాయంబుతో నున్న సుకుమారుఁడు. ఆతఁడు కయ్యంబున కరుదెంచిన నాగౌరవరక్షణంబునకై నే నతనిని మర్దింపక విడువ నను. నీయందలి ప్రేమచే నట్లు చేయమనస్కరింపదు. అది కారణంబున నీయుదంతంబు మీకెఱింగింప నేతెంచితిని.

గీ. నన్నెఱుంగక యెదిరింప నున్నయట్టి
భీమబలు దీననుండి తప్పించు టొండెఁ
గానిచో నెల్లి కానున్నగమనభంగ
దశ నసైరించుటొండెఁ గర్తవ్యమిపుడు. 11

ఆతఁడు తనంతటఁదానె నాకనిష్టమైన కయ్యంబునకు దొరకొనుచుండెఁ గావున నిందు నాలోప మేమియు లేదు.

ప్రద్యు—మల్లుఁడా! నీకు నాయెడలఁ గలప్రేమాతిశయమునకు నిన్నుఁ గొనియాడుచున్నాఁడను. అందులకు నావలనఁ గలుగఁదగిన కృతజ్ఞతాఫలము



నొందఁగలవు. నాసోదరుని యుద్యమము నాకింతకు మున్నే తెలిసినది. నేనును సాధ్యమయినంతదనుక మరలింపనే ప్రయత్నించితి. కాని వాని పూనిక మానదయ్యెను. మల్లుఁడా! నేఁ జెప్పునది వినుము. రాజపుత్రస్థానమునఁ బట్టుదలయం దీతని మించినవారు లేరు. అత్యాశాపరుఁడు; ఉన్నతుల యందలి యోగ్యత కసూయఁజెంది దానిభంజింప యత్నించుచుండును. సోదరుండనైన నన్నుఁ గూడఁ గడతేర్ప రహస్యమార్గమున దుర్మార్గపుఁదంత్రములఁ బన్నుచుండు. కావున నీవిషయమున నీవే యోజించుకొనుము. నీవతని వికలాంగుని జేసినను, విగతజీవుని జేసిన నొక యాకుం ద్రెంచిన క్లైంచెదను. అట్లు చేయుటయే నీకు మంచిది. నీ వతనికి స్వల్పావమానము గలిగించి విడచినను, లేక నీవాతనిచేత సంపూర్ణముగఁ బరిభవింపఁబడకున్నను నీకు విసమొసంగియో, నీపై దొమ్మిగల్పించియో మఱియెటులో నీప్రాణములు తీయువఱకు విడువఁడు. నానేత్రములు బాష్పపూరితములుగా నీకు నిజముఁజెప్పుచున్నాను. వర్తమానమున నింతటిదుర్మార్గుఁడు మఱియొకండు కానరాఁడు. వానియెడల సోదరభావముతో నేఁజెప్పుచుంటిని. కాని నిజమైనస్వరూపస్వభావములు నీకు వెల్లడించినయెడల నేను సిగ్గుపడి దుఃఖింపవలయును; నీవు తెల్లపోయి నిర్విణ్ణుఁడవు కావలయును.

మల్లు—నేను మీదర్శనమునకు వచ్చినందులకు మిక్కిలి సంతసించుచుంటిని. వచ్చినయెడల రే పాతనికిఁ దగినప్రతిఫల మొసంగెదను. ఆతఁడు నాబారిఁబడి స్వతంత్రుఁడై లేచిపోఁగలిగినయెడల నిక్కమగు బాహుసన్న్యాసముఁ జేసెదను. భగవంతుఁడు మిమ్ము రక్షించునుగాక!

ప్రద్యు—మల్లుఁడా! నీకు జయము. పోయిరమ్ము.

మల్లు—(నిష్క్రమించును)

ప్రద్యు—నే నీజెట్టివానిం బురికొల్పి రోషము పుట్టించితిని. నాసోదరుని యంతమముం జూచెద ననుకొనియెదను. ఏలొకో నాయాత్మ వానికంటె నధి

కముగా నెవ్వనిని ద్వేషించుటలేదు. అయినను వాఁడు సాధువు. విద్యలు నేర్పింపకున్నను బండితుఁడుగాఁ బరిణమించెను. ఘనమైన యుపాయములు పూర్తిగాఁ గలవాఁడు. సర్వజనులచేతను మిక్కిలి ప్రేమింపఁబడుచుండును. ఎల్లరహృదయముల నాక్రమించెను. నాబంధువుల మనస్సులనే యాకర్షించెను. వా రాతని బాగుగా నెఱుంగుదురు. కావున నే వారు నన్ను నిందింతురు. ఇఁక దీర్ఘకాల మిటులు జరుగనేరదు. ఈ మల్లుఁడు సకలమును జక్కఁబెట్టును. ఇఁక భీమబలుని మల్లయుద్ధమునకుం బురికొల్పుటకంటెఁ గర్తవ్య మేదియును లేదు. నే నిప్పు డాపని మీఁదనే పోయెదను.

(నిష్క్రమించుచున్నాఁడు.)

## 2-వ రంగము.

### రాజమందిరోపాంతము.

(చారుమతియుఁ, గమలయుఁ బ్రవేశించుచున్నారు)

కమల—అక్కా! చారుమతీ! నిన్ను బతిమాలుకొనియెదను. సంతోషముతో నుండుము.

చారు—కమలా! నామదిం గలసంతసముకంటె నెక్కువ యే కనఁబఱుచుచుంటిని. నేనింతకంటెను సంతోషముతో నుండవలె నని కోరుచుంటివా? రాజ్యభ్రష్టుఁడై దేశమునుండి వెడలింపఁబడిన జనకుని మఱచువిధానమును నీవు నాకు నేర్పిననే గాని యసామాన్య మగునాహ్లాదమును జ్ఞప్తికిఁ దెచ్చువిధానమును నాకు నేర్పవలదు.

కమ—దీనింబట్టి చూడ నేను నిన్నుఁ బ్రేమించినంతదృఢముగా నీవు నన్నుఁ బ్రేమించునటులు తోఁచుటలేదు. నీతండ్రియే నాజనకుని రాజ్యభ్రష్టునిఁ జేసి దేశమునుండి వెడల నడిచినయెడల నేను నీయొద్దనుండి నాకు నీయం



దలి ప్రేమాతిశయముచే నీతండ్రిని నాతండ్రిగా భావించి యుందును. నీకును నట్టి ప్రేమ నాయందుఁ గలిగినయెడల నీవును నన్నట్లే భావించి యుందువు.

చారు—సరే. నాప్రకృతావస్థను మఱచిన వైభవమునకై యానందించెదను.

కమ—మాతండ్రికి నేను దక్కఁ దక్కినసంతానము లేదని నీ వెఱుంగుదువు. ఇఁక ముందును గలుగఁబోదు. నాజనకుననంతరమున నీవే రాజ్యాధికారమును వహింపఁగలవు. ఏమన;— ఆతఁడు నీతండ్రియొద్దనుండి బలాత్కారముగ నాకర్షించిన సర్వస్వంబును బ్రేమతో నేను నీయధీన మొనర్తును. నేను మర్యాదగలదాననే యైనచో నీకిచ్చితీరెదను. నే నీ ప్రతిజ్ఞకుం దప్పితినేని పిశాచమ నగుదునుగాక! కావునఁ బ్రాణప్రియా! చారుమతీ! యూఱడిల్లుము.

చారు—సోదరీ! ఇంక నటులే యుండెదను. మన మాడుకొనఁదగిన క్రీడల వేనినైనఁ గల్పింపుము. దాని కేమిగాని, పురుషుని స్త్రీవలచుటయందు నీ యభిప్రాయమేమి?

కమ—సర్వదా నటనమాత్రము గాని యేపురుషునియందును బద్ధానురాగమునఁ బ్రవర్తింపవల దని దైవసాక్షిగాఁ జెప్పుచున్నదానను. ఆనటనమాత్రమైనను మన మాననినివిడుచునెడల మనమర్యాదకు భంగకారి కాకుండునదిగా నుండవలయును.

చారు—అట్లయిన మన మిప్పు డేమి యాడుకొందము?

కమ—ఇప్పు డదృష్టదేవతయొక్క కాలచక్రమును బరిహసింతము. అందువలన నామె యింతటినుండి సమానఫలములఁ బంచిపెట్టఁ గలదు.

చారు—అట్లు చేయఁగలిగినచో నాకును సమ్మతమే. ఆమె యీవులనను రూపములు. అందును స్త్రీలవిషయమున మిక్కిలి వ్యత్యస్తములు. కావున నీమె యంధురా లయిన యౌదార్యవతి.

కమ—అవును సత్యమే.

చ. ధరణి నగణ్యరూపగుణధన్యలు యోగ్యతఁ గల్గియుంటయే
యరు దగు, యోగ్యతాగరిమ నందినకాంతలు రూపహీనలై
పరఁగుదు రిట్లు సద్గుణవిపాకము దుర్గుణపాళితోడ సం
కర మొనరించు, గ్రుడ్డిదనఁగాఁ జనదే యిఁక భాగ్యదేవతన్. 12

చారు—కమలా! నీప్రసంగము భాగ్యదేవతనుండి స్వభావములోనికిఁ జేరుచున్నది. ఏమనఁ బ్రాపంచికవిషయోపభోగ మొసంగుట భాగ్యదేవతపని గాని, సహజము లైనవాని నిచ్చుట కాదు.

(విదూషకుఁడు ప్రవేశించుచున్నాఁడు)

కమ—అట్లుకాదు. స్వభావ మొకచక్కనిరూపమును సృజింప నది భాగ్యవశమున నగ్నిసంపర్కమున వైరూప్యము నొందఁగూడదా! భాగ్యదేవత నధిక్షేపించు చాకచక్యమును మనకు స్వభావ మిచ్చినను భాగ్యదేవత మన ప్రసంగమున కంతరాయము గలిగించుట కీవిదూషకుని బంపియుండలేదా!

చారు—నిజమే. స్వభావముయొక్క యొకకార్య మగువిదూషకునిచే దాని మఱియొకకార్య మగుమనచాకచక్యమును బరిహసింపఁజేయుట భాగ్యదేవతకు యోగ్య మయినపని గాదు.

కమ—భాగ్యదేవత పన్నినయెత్తు గాక యిదియు స్వభావసిద్ధమయిన దయినను గావచ్చును. ఇట్టి దేవతలవిషయమునఁ జర్చించుటకుఁ బ్రకృతమున మన సమయోచితజ్ఞానము మొక్కపోయి యుండెనని గ్రహించి దానిని సానపెట్టుట కీస్వభావసిద్ధుఁ డగువిదూషకుని స్వభావమే పంపియుండును. సదా విదూషకుని మాంద్యమే చాకచక్యమునకు వన్నె దెచ్చును. విదూషకా! ఎచ్చటఁ దిరుగుచుంటివి!

విదూ—అమ్మా! నీవు నీతండ్రిగారియొద్దకు రావలెను.

కమ—నిన్ను దూతగాఁ బంపిరా?

విదూ—నాతోడు. అట్లుగాదు. నీకొఱకు వెళ్లవలసిన దని చెప్పఁబడితిని.



చారు—విదూషకా! నీ వీవొంగయొట్టుల నెచ్చట నేర్చుకొంటివి?

విదూ—ఒకానొకశూరుఁడు రొట్టెలు రుచిగానున్న వనియు నావపిండి రుచిగాలే దనియును దనమీఁద నొట్టుపెట్టుకొనెను. కాని నిజముగా రొట్టెలరుచిగాను, ఆవపిండి రుచిగా నున్నదని చెప్పఁగలను. అయిన నాశూరుఁడు, అసత్యవంతుఁ డని చెప్పవీలులేదు.

కమ—నీకుఁ గలకొండంత తెలివి కీసంగతినిగూడ నిర్ధారణసేయఁగలవా?

చారు—అవును. భగవత్సాక్షిగా నీవు మూటగట్టియుంచిన జ్ఞానమును విప్పి వినియోగపఱుపుము.

విదూ—అట్లయిన మీరుభయులును లేచి నిలువఁబడుఁడు. మీగడ్డములు చిక్కఁదీసి సవరించుకొని నేను దుర్మార్గుఁడ నని మీగడ్డములపై నొట్టుపెట్టికొనుఁడు.

కమ—మాకుగడ్డములుండిన వానితోడుగా నీ వట్టివాఁడవే.

విదూ—నేను దుర్మార్గుఁడనే యైన యెడల నానుర్మార్గము తోడుగా నేనట్టివాఁడనే. మీరు లేనిదానిపై నొట్టిడుకొననట్లే! ఏలయన నాతనికి గౌరవమే లేదు. అట్లుగాక వానికే మయిన గౌరవముండిన నారొట్టెలను జూచుటకుఁ బూర్వమే యాగౌరవము పై నొట్టుపెట్టుకొని దానిని బోఁగొట్టుకొనెను.

కమ—నీ వెవ్వరిని గూర్చి ముచ్చటించుచుంటివో దయచేసి చెప్పుము.

విదూ—మీతండ్రికిఁ బ్రేమాస్పదుఁ డగునొకవృద్ధును గూర్చియే ముచ్చటించుచుంటిని.

కమ—అతనిని గౌరవించుటకు మాతండ్రి ప్రేమయే చాలును. చాలు నాతనివిషయ మిఁక మాటలాడకుము. ఇట్లు వాని నిందించినందులకు నీవెప్పుడో కొరడాదెబ్బలు తినెదవు.

విదూ—ఏమిగ్రహచారము! బుద్ధిమంతు లజ్ఞానముగా నాడినమాటల నజ్ఞానులు బుద్ధిగలిగి పలుకఁగూడదు కాఁబోలును.

కమ—ప్రమాణముగా నీవు నిజము పలికితివి తెలివితక్కువవానికిఁ గలకించిద్జ్ఞానము సైతము నణఁగఁద్రొక్కఁబడును. బుద్ధిమంతులకుఁ గల స్వల్పలోపములయిన నట్లే వెల్లడిలోనికి వచ్చును. అదే వైవస్వతుఁ డిటువచ్చుచున్నాఁడు.

చారు—నోటినిండ విశేషవార్తల నిడుకొని.

కమ—పావురములు పిల్లలను మేఁపునటులు వానిని మనమీఁద వెదచల్లును.

చారు—అటులైన మనము వార్తలలో మునుఁగుదుము గాఁబోలు!

కమ—మఱియు మంచిదియే. మనము లోకమునకు మఱింత రాణించెదము.

(వైవస్వతుఁడు ప్రవేశించును.)

వైవస్వతుఁడా! వందనములు. ఏమివిశేషములు?

వైవ—సౌందర్యరాశి వగునోరాజకుమారీ! మంచివినోదకర మగునాటను జూడకపోయితిరిగదా!

కమ—ఆటయా! యేరంగుగలది?

వైవ—అమ్మా! ఏమిరంగా? నీకేమని ప్రత్యుత్త మిచ్చెదను?

చారు—నీచాకచక్యమును, భాగ్యదేవతయును ప్రబోధించినటులు.

విదూ—లేక నీకర్మము విధించినటులు.

కమ—బాగుగాఁ జెప్పితివి.

విదూ—నాగౌరవమును నేను నిలువఁబెట్టుకొననిచో

చారు—నీపురాతనవాసనను బోఁగొట్టుకొనియెదవు.

వైవ—యువతీమణులారా! మీరు నాకాశ్చర్యమును గలిగించుచున్నారు. నీకదృష్టపూర్వ మైనయొకబాహుయుద్ధమును గూర్చి చెప్పఁదలఁచితిని.

చారు—ఆపద్ధతిని గొంచెము మాకువివరింపుము.

వైవ—ప్రారంభము చెప్పెదను. అది మీకాహ్లాదకరముగా నుండినచో దానిపరిసమాప్తి మీరు గాంచఁగలరు. ఏలయన, అందు ముఖ్యమయిన దింకను



జరుగనై యున్నది. మీరు నిలిచియుండిన స్థలముననే తమబాహుపాటవముం బ్రదర్శింప నేతెంచుచున్నారు.

కమ—ప్రారంభము గతార్థ మగుటచే మృతప్రాయమైనది.

వైవ—అదిగో నొకవృద్ధుఁడును, వానిపుత్త్రత్రయమును నిచ్చటికే వచ్చుచున్నారు.

కమ—ఈప్రారంభము నొకపురాతనగాథతోఁ బోల్పనగును.

వైవ—లేఁబ్రాయము గలమువ్వురు బలిష్ఠులైన సుందరపురుషులు కంఠములఁ బత్త్రికలఁ గట్టుకొని—

చారు—(పత్త్రికశబ్దార్థమును శ్లేషించి) ఇందు మూలముగా సకలమైనవారికిఁ దెలియఁబఱచునది యేమనఁగా:—

వైవ—మ. ధరణీనాథునిమల్లుతోడ భుజయుద్ధస్పర్ధ పెంపార, ము
వ్వురు నోలిం దలపడ్డఁ దద్ఘనభుజాభోగంబులన్ శల్యముల్
విఱుగన్ రక్తము గ్రక్క జట్టువిడువన్ వృద్ధుండు పుత్త్రార్తిమై
దురపిల్లెం గనువారిమానసము లా దుఃఖాబ్ధిలో మున్గఁగన్. 13

చారు—అయ్యో!

విదూ—అయ్యా! అది సరియేకాని, ఇం దీస్త్రీలు చూడక మించఁబెట్టుకొనిన యాటయేమి?

వైవ—నే నిప్పుడు చెప్పినదియే.

విదూ—ఇట్లే ప్రజ లానాఁటి కానాఁడు జ్ఞానవంతులు కావచ్చును. ఎముకలు విఱుగఁ గొట్టుట యంతఃపురాంగనల కాట యని నేను వినుట కిదియే మొదటిసారి.

కమ—నిజము. ఇది నాకును గ్రొత్తసంగతియే.

చారు—మఱి యెవ్వాఁడయినను వానిచే విఱుగఁగొట్టఁబడుచుండు నెముకల సంగీతము విన నాహ్లాదపడువాఁడును, నట్లు విఱుచుటయం దానందించువాఁడును గలఁడా! (కమలనుఁ జూచి) చెల్లెలా! ఈమల్లయుద్ధకౌశలముం గనుఁగొందమా?

వైవ—ఇచ్చట నాఁగినవీరు చూచియే తీరవలెను. వా రేర్పఱచుకొనిన బాహు సంగరరంగ మిదియే. వారందునకు సిద్ధముగానున్నారు.

కమ—నిజమే. చూడుఁడు. వారు వచ్చుచున్నారు. మన మిచ్చట నాఁగి దీనిం జూతము.

(ఢంకా నాదము వినఁబడును.)

(ప్రవేశము—విక్రమసేనుఁడు, సామంతులు, భీమబలుఁడు, మల్లుఁడు, పరివారము)

విక్ర—రండు. మన మెంతచెప్పినను నాయువకుఁడు తనయుద్యమమునుండి మరలకున్నందున ననుపదంబుననే వానికి దుర్దశ సిద్ధింపఁగలదు.

చారు—అతఁడేనా?

వైవ—ఔనమ్మా యతఁడే.

కమ—అతఁడు కడుఁజిన్నవాఁడే! అయినను జయచిహ్నము లాతనిముఖమునఁ గాన్పించుచున్నవి.

విక్ర—ఓహో! పుత్త్రికయు సోదరపుత్త్రికయు నా! బాహుయుద్ధపాటవదిదృక్షు నిచ్చటి కరుదెంచితిరా?

చారు—ప్రభువా! ఔను. అందునకు మాకనుజ్ఞ యొసంగుము.

విక్ర—హస్తిమశకాంతరముతో నున్న వీరిబాహుయుద్ధము మీకాహ్లాదముఁ గలిగింపనేర దని నేను నిశ్చయముగాఁ జెప్పఁగలను. ఈతనిబాల్యదశం జూచి జాలినొంది మరలింప నెంత ప్రయత్నించినను నామాటలఁ బెడచెవిం బెట్టుచుండెను. కన్యకలారా! మీరాతనితోఁ బ్రశంసించి మీకు వీలయినంత వానిమనస్సును మరలింపుఁడు.

కమ—వైవస్వతుఁడా! వాని నిటు పిలువుము.

విక్ర—అటులు చేయుము. నే నవ్వలి కేగెదను.

వైవ—ఓయీ! భీమబలుఁడా! రాజపుత్త్రికలు నిన్నుఁ బిలుచుచున్నారు.



భీమ—సంపూర్ణ మైనగౌరవముతో వారిని దర్శించుచున్నాను.

చారు—యువకుఁడా! మల్లునితో నీవు పోరాడఁ బ్రతిజ్ఞఁజేసితివా?

భీమ—ఓరాజపుత్త్రీ! అట్లుగాదు. అతఁడే లోకు లందఱుపయినిఁ బ్రతిజ్ఞ నెట్టెను. ఇతరులవలెనే నేనును వానితో నాబలమును బరీక్షింప వచ్చితిని.

కమ—అయ్యా! నీధైర్యసాహసములు నీలేఁబ్రాయమునకు మించినవిగా నున్నవి. ఈమల్లుని కర్కశ మయినబాహుపరాక్రమమునకుఁ దార్కాణము నీక్షించియే యుంటివి.

గీ. అతనిఁ గనులారఁ గాంచి సాహసమువలనఁ
గలుగు ప్రతిఫల మెట్టిదో తెలిసికొనుము
దీన సరిసాటివానితోఁ బూనుకొనుట
భావ్య మని తోఁచు నిదియ మాప్రార్థనంబు. 14

చారు—అయ్యా! అటులే చేయుఁడు. ఇంతమాత్రమున మీగౌరవమునకు హాని కలుగనేరదు. ఈబాహుయుద్ధమును నిలుపుచేయుఁ డని రాజుగారిని వేఁడుకొందుము.

భీమ—మీరు కఠినమైన యూహాలతో నన్ను శిక్షింపవల దని వేఁడుకొను చున్నాను. సౌహార్దవతు లైనసుందరుల మనోభీష్టము నెఱవేర్పకుండుట నాయది నేరమే కాని నీసదయకటాక్షములును, మృదులము లైన తలంపులును నాతోఁగూడ బాహుయుద్ధరంగమునకు రానిచ్చి నా కుత్సాహముం గలిగింపుఁడు.

ఉ. ఓడిన గౌరవంబు చెడు నోయన నయ్యది సున్న, మిత్త్రికై
వేఁడుచునుంటిఁ గాన నది వెక్కసమె ట్లగు, నేడ్వ మిత్త్రుఁడున్
లేఁడు, ప్రపంచసంగమము లేదు, మహీతలమందు యోగ్యుఁడౌ
వాఁడు వసింపఁ జోటగు నవశ్యము మన్మరణంబుచే నికన్. 15

చారు—నాకుఁ గలస్వల్పబలము నీకుఁ దోడగుంగాక!

కమ—దానికిఁ దోడుగా నాదియు నట్లే యగుంగాక!

చారు—నీకు జయ మగుంగాక! నీబలపరాక్రమములయందు నాకుఁ గలిగిన యూహ భ్రమ యగుటకు దేవునిఁ బ్రార్థించుచున్నాను.

కమ—నీహృదయమందలి జయవాంఛ నీకుఁ దోడ్పడుంగాక!

మల్లు—భూదేవికి సాష్టాంగపడఁ గోరిన స్వాతిశయపరుఁ డగుచిన్నవాఁ డెచ్చట నున్నవాఁడు?

భీమ—అయ్యా! సిద్ధముగా నుంటిని. నేను స్వాతిశయవంతుఁడను గాను.

విక్ర—నీకొకపాటునకే సెల వొసంగెదను.

మల్లు—నాతోఁ బోరికి దొరకొనవల దని యింకొకసారి వీని వేఁడుకొనుపని లే దని యేలినవారితో నిశ్చయముగా మనవిచేసికొనుచుంటిని.

భీమ—జయమందినవెనుక నన్నాక్షేపింపవచ్చును గాని ముందుగనే ప్రగల్భంబు లాడెదవేల? ఉపక్రమింతమా?

చారు—నవయౌవనుఁడా! బలపరాక్రమముల మిన్నయగు భీముఁడు నిన్నుఁ గాపాడునుగాక!

కమ—నే నదృశ్యరూపమును ధరింపఁగలుగు నెడల నామల్లుని కాళ్లకు బంధము వేసియుందును.

(యుద్ధము సేయుచున్నారు)

చారు—ఓహో యువకుఁడా! బాగు బాగు.

కమ—నాకంటఁ బిడుగులు రాల్పఁగలిగిన యెడల నెవరు క్రిందఁబడవలయునో చెప్పెదను.

(మల్లుఁడు క్రిందఁబడె నని కేకలు వేయుచున్నారు)

విక్ర—ఇఁకఁ జాలు నిఁకఁ జాలు.

భీమ—చిత్త మట్లే నిలిచెదను. నే నింకను శ్వాసము పూరించియుండలేను.



విక్ర—మల్లుఁడా! ఎట్లుంటివి?

వైవ—ప్రభువా! అతఁడు మాటలాడలేఁడు.

విక్ర—అతనిని మోసికొనిపొండు. చిన్నవాఁడా నీపే రేమి?

భీమ—దేవా! భీమబలుఁ డందురు. విజయభూపతి కనిష్ఠపుత్త్రుఁడను.

విక్ర—మ. ధరణీలోకమునన్ భవజ్జనకుఁ డుద్యద్గౌరవోపేతుఁడై
వఱలెం, దా నటులయ్యు శత్రువుగ మాపట్లం బ్రవర్తించె నీ
వరయన్ బాహుబలాభియుక్తుఁడవు నీవాతండ్రికిం గాక యె
వ్వరికేనిం దనయుండవేని నిను సంభావించియుండుం గదున్. 16

నీకు శుభమగుంగాక పోయిరమ్ము.

(విక్రమసేనుఁడు వైవస్వతుఁడు పరివారము నిష్క్రమింతురు.)

కమ—అక్కా! నేనే నాతండ్రిస్థానమున నుండిన నిట్లు చేయుదునా!

భీమ—నేను విజయభూపతికనిష్ఠపుత్త్రుఁడ నైనందునకు మిక్కిలి గర్వపడుచున్నాను. విక్రమమహారాజునకు దత్తపుత్త్రుఁడ నగుట కైన నాపేరును మార్చుకొన నంగీకరింపను.

చారు—నాతండ్రి విజయభూపతిని దనయాత్మవలెఁ బ్రేమించెను. ప్రపంచమంతయు నట్లే ప్రేమించెను. ఈతఁడు విజయభూపతి పుత్త్రుఁ డని తొలుతనే తెలియవచ్చినయెడల వీని నీయుద్యమమునకుం బూనవల దని కన్నీరొలుక వేఁడుకొనియుందును.

కమ—అక్కా! మన మేగి యాతని నాదరించి యుత్సాహము కలిగింతము. నాతండ్రియొక్క యసూయాపరము లగుసంభాషణంబులు నాహృదయమును భేదించుచున్నవి. (భీమబలునిం గూర్చి) అయ్యా! నీవు స్తోత్రపాత్త్రుఁడవు. ఈవిషయమున నీవాడినదానికంటె నెక్కుడుగఁ జేసి చూపితివి. ఆరీతినే నీవనురాగవిషయమునఁ గూడఁ బ్రవర్తించిన నీకుఁ బ్రేమాస్పదురాలగుయువతి మిక్కిలి సుఖించును.

చారు—ఆర్యా! (తనకంఠమునుండి యొకహారమును దీసియిచ్చుచు) భాగ్యహీన నగునాచే నీయఁబడు హారమును గ్రహించి ధరింపుఁడు. ఇంతకన్న ధనాఢ్య నైనయెడల నెక్కుడుపారితోషిక మొసంగియుందును. కమలా! మనముపోదమా ?

కమ—సరే. అయ్యా! మీకు శుభ మగుఁగాక!

భీమ—నేను మిమ్ముల నాశీర్వదింపఁజనదా ? నా తేజ మంతయు హరింపఁబడినది. ఇపుడు మీయెదుట నిలువఁబడి యున్నది మనుష్యాకార మయిన నిర్జీవప్రతిమయే.

చారు—ఆతఁడు మనలను వెనుకకుఁ బిలుచుచున్నాఁడు. నాయదృష్టముతోపాటు గర్వమును హరించినది. అతని కేమికావలయునో తెలిసికొందును. (వానివంకఁ దిరిగి) అయ్యా! పిలిచితిరా ? మీరు మల్లయుద్ధమునఁ జక్కఁగా నిర్వహించి మీశత్రులకంటె నెక్కుడువారిని జయించితిరి.

కమ—అక్కా! నీవువెళ్లెదవా ?

చారు—నీతో వచ్చుటకు సిద్ధముగా నుంటిని (భీమబలునితో) మీకు శుభ మగుఁగాక!

(చారుమతీకమలలు నిష్క్రమింతురు.)

భీమ—ఏదుర్ఘటమైన యుద్రేకము నాజిహ్వ నరికట్టినది ? ఆమె నాతో మాటలాడవలె నని ప్రయత్నించినది కాని నే నామెతో ముచ్చటింపఁజాలనైతి. ఓభీమబలుఁడా! నీవు పడిపోయితివి. ఇప్పుడు మల్లుఁడుగాని, వానికన్న బలహీన మగునెద్దియేని నిన్ను జయింపఁగలదు.

వైవ—(సమీపించి) అయ్యా! నీయందుఁ గలవాత్సల్యముచేఁ జెప్పుచుంటిని. మీరీస్థలమును విడిచి పోవలయును. మీరు నిజముగా నెక్కుడు పొగడ్తకును, సత్యమైనస్తోత్రములకును, ప్రేమకును బాత్రులు. కాని యిప్పుడు నీకృత్య మంతయు రాజున కపోహము గలిగించుచున్నది. రాజు చలచి



త్తుఁడు. వానిస్థితిగతులు నేను జెప్పుటకంటె నీ వూహించుకొనుటయే యుక్తము.

భీమ—అయ్యా! మీకుఁ గృతజ్ఞుఁడను. దయచేసి నాకొక్క సంగతిం దెల్పుఁడు. బాహుయుద్ధకాలమున నేతెంచిన సుందరులలో నీరాజపుత్త్రిక యెవరో చెప్పఁగలరా ?

వైవ—గుణసంపదను బట్టి చూడ నీయుభయులు వానికాత్మజు లనిపించుకొనఁజాలరు. ఐనను వారిలోఁ గనిష్ఠురాలు రాజనందన. రెండవయది రాజ్యభ్రష్టత నందిన రాజుకూఁతురు. రాజద్రోహి యగుపినతండ్రి తనకుమార్తెకుఁ జెల్మికత్తెగా నుండుటకై యామె నిచ్చట నాఁపెను. వారి యన్యోన్యానురాగానుబంధము లేకోదరులకైన నరుదు. ఆమెతండ్రిదురవస్థను దలఁచి ప్రజ లామెను గాంచి జాలిపడుచుండి రనియు నామెసుగుణమణి యని జనులు పొగడుచుందు రనియుఁ దనసోదరపుత్త్రికయం దీర్ష్య వహించియుండెను. ఈమెయం దాతని కంకురించిన యీర్ష్య కొలఁదికాలమున నువ్వెత్తుగాఁ బ్రజ్వలించి పైకుబుకఁగలదు. మీకు శుభ మగుఁగాక! ముందింతకంటె మంచిదగు మఱియొకలోకమున మీతో నెక్కువ సహవాసముఁ జేయఁగోరెదను.

భీమ—మీకు నేను మిక్కిలి కృతజ్ఞుఁడ నై యుండెదను. మీకు మేలగుఁగాక!

(వైవస్వతుఁడు నిష్క్రమించును.)

గీ. అల్పధూమంబు దాఁటి కాలాగ్నిమిళిత
మైనఘనధూమమును జేరనరుగుకరణి
భూపతిని దాఁటి సోదరుఁ బొందవలసెఁ
జారుమతి యనుస్పర్శి వాసంబు విడిచి. 17

(నిష్క్రమించుచున్నాఁడు.)

## 3-వ రంగము.

### రాజభవనమున నొకగది.

(ప్రవేశము—కమలయుఁ, జారుమతియు)

కమ—అక్కా! చారుమతీ! ఒక్కమాఱైన నాపవేమే! కామదేవునికి దయ గలుగుఁగాక!

చారు—మందున కొక్కమాటయైనను లేదు.

కమ—నీవాక్యము లంతకంటె నెక్కుడు విలువగలవి. నీవాక్యామృతము నించుక నాపై సోఁకనిమ్ము. రమ్ము. వాదగతుల నన్నుఁ గుంటిఁ జేయుము.

చారు—అటులయిన నిద్దఱు సోదరపుత్త్రికలును రోగిష్ఠులై యుందురు. వాదమున మనలో నొకరు కుంటివా రగుట తటస్థించినపుడు రెండవవా రకారణముగ నున్మత్తత వహింతురు.

కమ—ఇది యంతయు నీతండ్రికొఱకేనా?

చారు—కాదు, దానిలోఁ గొంత నానిమిత్తము. ఈప్రపంచమున దినచర్య యెంతటి కంటకములతో నిండియున్నది!

కమ—అక్కా! అవి వేడుకసమయములలో నీపైఁ బ్రయోగింపఁబడిన పరిహాసములె కాని వేఱుకావు. ఇదివఱకు నలఁగినమార్గమున మనము నడువని యెడల మనరయికలకుఁ గూడఁ జీగిరింతపూవు లంటుకొనును.

చారు—కంచుకమున కంటుకొనిన నవి దులిపివేయఁగలను. ఇవి కంటకములై నాహృదయము నంటుకొనినవి.

కమ—అటులయిన వానిని వెడలఁగ్రక్కుము.

చారు—బిగ్గఱగా నొకసారి గొంతెత్తి యేడ్చుటచే వానిని బొందఁగలుగుదు నేనిట్లు ప్రయత్నించెదను.

కమ—ఊరడిల్లుము. నీమనోగతకాంక్షలతోఁ బోరాడి నిగ్రహింపుము.



చారు—పోరాటమున నవి నాకంటె బలవత్తరము లైయున్నవి.

కమ—ఇందు నీకే జయము గలుగుఁగాక! నీవిప్పుడు పరాజితురాల వయ్యును గాలక్రమమున జయమునందఁ బ్రయత్నింపుము. కాని యీయన్యాపదేశప్రసంగములు మాని నిశ్చితార్థమును ముచ్చటించుకొందము. ఇంత యాకస్మికముగ విజయభూపతి కనిష్ఠపుత్త్రునిపై నీవింత బద్ధానురాగ వగుట సంభవమా!

చారు—మాజనకుం డీతనితండ్రిని మిక్కిలి ప్రేమించెను.

కమ—అందుచే నీ వాతనిపుత్త్రుని మోహింపవలె నని నిబంధన గలదా? ఈపద్ధతి నవలంబింపవలసినచో నే నాతని ద్వేషింపవలసియుండును. ఏమన మాజనకుఁడు, నీతనితండ్రియు బద్ధద్వేషులు. అట్లయ్యు నేనాతని ద్వేషించుటలేదు.

చారు—నన్నుఁ జూచియైనను నిశ్చయముగా నాతని ద్వేషింపవలదు.

కమ—నే నెందునకు ద్వేషింపరాదు? అతఁడు ద్వేషార్హుఁడు కాఁడా?

చారు—అందునకే న న్నాతనిఁ బ్రేమింపనిమ్ము. నన్నుఁ బట్టి నీవును బ్రేమింపవలయును. అదిగో మీతండ్రి వచ్చుచున్నాఁడు.

కమ—కోపోద్రిక్తము లయినదృష్టులతో.

(విక్రమసేనుఁడును, సామంతులును బ్రవేశింతురు.)

విక్ర—(చారుమతి నుద్దేశించి) అమ్మగారూ! మారాజమందిరప్రాంతముల నుండి తత్క్షణమే వెడలిపోవుట కాయత్తపడుము. అదియే మీకు క్షేమము.

చారు—పినతండ్రీ! నన్నేనా?

విక్ర—సోదరపుత్త్రీ! నిన్నే.

గీ. పదిదినంబులు గడువొసంగెదను నీకు
నింతనుండియు మాగృహప్రాంతసీమ
దొలఁగి పదికోసులకు లోన నిల్చితేని
మరణశిక్ష విధింతు దుర్మార్గురాల.

చారు—నా నేరమును వివరించి దాని నావెంటఁ గొనిపోనిచ్చుటకై నిను మిగుల వేఁడుచున్నాను.

ఉ. నామది నేనెఱుంగు నెడ నామది వెల్వడు నెల్లకోర్కులన్
ధీమతినై యెఱుంగు నెడఁ దీవ్రమనోవికలత్వమైన న
న్నీమహిఁ జెందకున్నఁ గల నెప్పుడుఁ గాంచుట గాకయున్న నే
నేమియుఁ ద్రోహచింత సహియింపను మీపయి నెన్నఁడేనియున్. 19

విక్ర—రాజద్రోహు లందఱు నిట్లే పలికెదరు. మాటలంబట్టియే వారియపరాధరాహిత్యమును నిర్ణయించు నెడల సర్వదా సత్యస్వభావులుగనే తోఁపఁగలరు. నాకు నీయందలియపనమ్మకమే నీనిష్క్రమణమునకుం దగినకారణము.

చారు—మీరు నమ్మకుండినంతమాత్రమున నేను రాజద్రోహ నెట్లగుదును? కాన మీయపనమ్మకమున కయినం దగినకారణముఁ జెప్పుఁడు.

విక్ర—నీవు నీతండ్రికిఁ గొమార్తె వగుటయే కారణము.

చారు—సీ. ఆడలించి వానిరాజ్యము నాక్రమించిన
నాఁడు నేనతనినందనను గానొ
శమము వోనాడి దేశమునుండి వెడలించు
నాఁడు నీకిట్టిజ్ఞానంబులేదొ
రాజాపచారంబు రహినించవంశాను
సరణంబుగా నెట్లు సంభవంబొ
తండ్రిచేసిన ద్రోహతంత్రంబునకు వాని
తనయుల శిక్షింపఁ దలఁచుకొన్న
గీ. నయిననాతండ్రి ద్రోహ మింతైనఁ గలదొ
విధివిపాకంబునను నిఱుపేదరాల
నౌట నీకెగ్గుఁ జింతింతు ననుచు నన్నుఁ
జలముసాధింప నిదిధర్మశాసనంబొ. 20



కమ—ఆర్యా! నావాక్యముల నించుక యాకర్ణింపుము.

విక్ర—ఆహా! కమలా! ఆమెను నీకొఱకుఁ గదా యింతవఱకిచట నాఁపినది. కానిచోఁ దనతండ్రితోఁ బాటుగ వనవాసము చేయవలసినదియేగదా!

కమ—ఆమె నిచ్చట నిలుపుచేయవలసిన దని నే నప్పుడు కోరియుండలేదు గదా! అందునకు మీపశ్చాత్తాపముం గరుణయుఁ గారణములు. నే నప్పుడు ముద్దరాల నగుటచే నామె విలువను గ్రహింపఁజాలకుంటిని. ఇపుడు బాగుగ నెఱుంగుదును. ఆమెయే రాజద్రోహిణి యైనచో నే నేలకాను? ఇప్పటికిని మేము శయనోత్థానవిహారాభ్యవహార విద్యాభ్యాసాదులయందుఁ గహోత్తయుగ్మంబుంబోలె నెన్నం డెడబాయక ప్రవర్తించుచుంటిమి. అట్టి మాకిప్పుడీ బలాత్కారవిరహం బసంభవంబు.

విక్ర—ఈమె నీకంటెఁ గడుఁ దక్కరి. ఈమె వినయంబును, గాంభీర్యము, నోర్పును ప్రజల నాకర్షించి తనయెడలఁ జాలి గలుగఁ జేయుచుండెను. నీవు కడు వెఱ్ఱిదానవు. నీకుఁ రాఁదగినకీర్తిని హరించుచున్నది. ఈమె మనయొద్దనుండి వెడలిపోయిననే గాని నీసుగుణసంపదయు, నీచాకచక్యంబును లోకమునకు వెల్లడి కానేరవు. కావున నధరస్పందన మొనర్పకుము. ఈనాయాజ్ఞ నిశ్చలంబును నప్రతిహతంబును. ఈమెకు విదేశగమనశిక్ష విధించితిని.

కమ—ఓయేలికా! నీవాశిక్షను నాకుఁగూడ విధింపుము. నే నీమెను విడిచి క్షణమైన బ్రతుకఁజాల.

విక్ర—నీవు కేవలము ముద్దరాలవు. (చారుమతివంకఁ జూచి) చారుమతీ! నీవు ప్రయాణమునకు సిద్ధురాల వగుము. నాగడువు నతిక్రమించి నీవిచ్చట నున్నయెడల నేను గౌరవవంతుఁడ నగుదు నేనియు, నాయాజ్ఞ స్థిరమయిన దగు నేనియు నీకు మరణము తప్పదు.

(విక్రమసేనుఁడు, సామంతరాజులు, నిష్క్రమింతురు)

కమ—అయ్యో! చారుమతీ! నీ విప్పు డెక్కడకుఁ బోదువు? మనము తండ్రులను మార్చుకొనుట కీ వంగీకరింతువా? నేను నాతండ్రిని నీకిచ్చెదను.

నాకన్న నీ వెక్కుడు విచారము నొందవల దని నిన్నాజ్ఞాపించుచున్నాను.

చారు——నాకుం దగినకారణము గలదు.

కమ——అక్కా! నీ కట్టివిశేషకారణము లేదు. ధైర్యము నవలంబింపు మని వేఁడుచున్నాను. మాతండ్రి నాకు దేశాంతరవాసశిక్ష విధించినది నీ వెఱుంగవా?

చారు——ఆతఁ డెప్పుడు నట్లొనర్పలేదు.

కమ——ఒనర్పలేదా? అటులైన మనయుభయులకు నేకదేహ మని ప్రబోధించు ననురాగమునఁ జారుమతి కొఱఁతఁ జెందుచున్నది. నెచ్చెలీ! మన మొకరి నొకరు విడిచి పోవలసినదేనా? కావున వియోగసన్నాహ మొనర్తుమా? అట్లు కాదు. నాతండ్రి తనకు మఱియొక కర్తను జూచుకొనుఁగాక. మన మిచ్చటినుండి తప్పించుకొని పాఱిపోవుట కనువగు సాధనోపాయమును, గమ్యస్థానమును, సేకరింపవలసిన వస్తుసముదాయమునుం గూర్చి మన మొక పథకము నేర్పఱచుకొనవలయును. ఈరాజాజ్ఞవలనఁ గలుగఁబోవు భాగ్యఫలములను, నీవే యొంటరిగ ననుభవింపఁ దలంపక యందు నాకుంగూడఁ బాలొసంగుము.

సీ. మనవిపద్దశఁ గాంచి మదిఁ గుంది పులుఁగులు
నుడువుల నూరార్చునో యనంగ
మనదుఃఖమును జూచి మంచనుకన్నీరు
నొలికించి దుఃఖించునో యనంగ
మనయధైర్యమున నెమ్మనము జల్లుమనంగ
నొరలి వెల్వెలవోవునో యనంగ
మనసాహసమెఱింగి వనవాసమును మాన్ప
నొగి వ్రాలి యరికట్టునో యనంగ



గీ. నెన్నఁ దగి తోడునీడగా నున్నయట్టి
గగనదేవత సాక్షిణిగా వచింతుఁ
గస్తి రానిమ్ము సౌఖ్యంబు గలుగనిమ్ము
పలుకు మెన్నైన నీవెంటఁబడక మాన. 21

చారు——అట్లయిన నెచ్చటికిఁ బోవుదము?

కమ——నాపెదతండ్రి నన్వేషింప దండకారణ్యమునకు.

చారు——అయ్యో! ఇది మన కెంత యపాయకరమైన కార్యము! అబలలము; గమ్యస్థానమా కడుదూరము, మ్రుచ్చులమనంబులు విత్తములకన్న లావణ్యమే యెక్కుడుగ నాకర్షించును.

కమ——నేను నాముఖమునకు మసిఁ బూసికొని, జీర్ణవస్త్రములను ధరించెదను. నీవును నట్లొనర్పుము. దుష్టులదృష్టిపథమునఁ బడకయే మనము దాఁటిపోనగును.

చారు——ఇట్లుచేసిన బాగుండును. నేను మిక్కిలి పొడవరి నగుటచే సర్వవిధములఁ బురుషుఁడ ననిపించుకొనుటకుఁ జాలియుందును. మూఁపున నొక గండగొడ్డలియుఁ జేత నొకయీఁటెయుఁ బట్టుకొనిన స్త్రీస్వభావసులభమగుభీరుత్వము హృదయమున నిమిడియున్నను, వీరవేషధారులయిన పిఱికిపందలకన్న మిన్నగఁ బైకి యుద్ధవీరునివలెఁ గాన్పించెదను.

కమ——నీవు పురుషుఁడ వైన ని న్నేమని పిలుతును?

చారు——మన్మథసహచరునియొక్క పేరుకంటెఁ దక్కువపేరు నేనొల్లను. కావున నన్ను వసంతుఁ డని పిలువుము. మఱి ని న్నేమని పిలుతును?

కమ——నాస్థితిగతుల కనుకూల మగునామము కావలెను. కమల యని పిలిపించుకొనఁజాలను. కావున శుకవాణి యనిపిలువుము.

చారు——ఓకమలా! మీతండ్రిసభ నలంకరించు విదూషకుని మనతోఁ గూడఁ గొంపోవ యత్నింతమా? అతఁడు మార్గాయాసము నపనయింపఁడా?

కప — అనంతమయిన ప్రపంచమున నాతఁడు నాతోఁ దిరుగును. వానిని వలఁజిక్కించుట నాపని గా విడువుము. మనము వెడలి మనకుఁ గలయాలంకారములను, ధనమును సేకరించుకొనవలయును. నన్న న్వేషింపఁ బంపఁబడు నెవ్వరికంటను బడకుండ గూఢమార్గమునఁ బోవుటకుఁ దగిన కాలమును విచారించుకొనవలయును. మనప్రయాణము, స్వేచ్ఛగా విహరించుటకుఁ గాని, దేశాంతరవాసశిక్షాఫలితము కాదు.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది ప్రథమాంకము.



శ్రీ

# చారుమతీపరిణయము.

## ద్వితీయాంకము.

### ప్రథమరంగము - నైమిశారణ్యము.

(సింహకేతుఁడు, ఆనందుఁడు, ముప్వురు సామంతరాజులు నాటవికవేషధారులై ప్రవేశింతురు.)

సింహ — వనప్రవాససహచరు లగునో సోదరులారా! డాంబికవేషధారులమై నటించు నున్నతదశకంటె సహజసుందర మైనయీవనవాస జీవితమే సౌఖ్యదమని చిరకాలానుభవమువలన మీకుఁ దోఁచుటలేదా! అనాయాసమన్వితమయినధర్మాసనముకంటె నీయరణ్యప్రదేశమే యెక్కువ నిరపాయ మైనది గదా! మనయాదిపురుషునియొక్క దైవాజ్ఞోల్లంఘనాలబ్ధ మయినయాహారార్థపరిశ్రమంబును, గాలస్వభావాగత మయినతుహినసంజాతక్లేశంబును, శరీరమును స్తంభింపఁ జేయఁజాలు శీతలఝంఝామారుతప్రచారంబును, మన మర్త్యభావము స్ఫురింపఁ జేయు సహాయములై యున్నవి. ఈశీతలమారుతాఘాతము దేహమును నలిమి యవయవంబుల స్తంభింపఁ జేసి నామర్త్యస్వభావమునే వెల్లడించుచున్నది గాని నన్నుఁ గొనియాడుట లేదు.

చ. పొలుపుగ దుర్దశానుభవభూతము లై తగుమేలు లన్నియుం
దలఁప ననన్యసామ్యములు తద్ద యసహ్యము శ్వేళియుక్తమై
మెలఁగెడు కృష్ణసర్పము త్రుమం దనమస్తకమం దమూల్యమై
వెలసిన రత్నరాజమును వేడ్క ధరింపదె యెన్నిచూచినన్.

మ. వనభాగంబుల నెట్టిచోద్యములు లభ్యంబయ్యెఁ దత్త్వప్రబో
ధనముం జేయఁగఁ జెట్లు నాళ్కలు సముద్యద్వాహినీపూరముల్
ఘనశాస్త్రంబులు ప్రస్తరంబులు వినంగానౌ నుపన్యాసముల్
మనరమ్యస్థితితో సమానములె దుర్మార్గంపు రాజ్యస్థితుల్. 23

ఆనందుఁడు—అస్పృష్టదేవతయొక్క క్రౌర్యమును నిర్మలమయిన సంతృప్తావస్థగాఁ బరిణమింపఁజేయుటచే నేలినవారు మిక్కిలి సౌఖ్యవంతులై యున్నారు.

సింహ—మన మిప్పుడు మృగయావ్యాపారమున మెలంగుదము రండు, పాపము, మృదులములును, విచిత్రవర్ణవ్యాప్తములును, సహజసుందరములు నగుచర్మములను కంచుకములు గలిగి, యరణ్యప్రదేశ మనుస్వదేశమునఁ జిరకాలవాస్తవ్యము లై స్వదేశలబ్ధము లైనయాహారాదికంబున బలిష్ఠములై సంచరించు నీమృగవితానంబు విదేశీయుల మగుమనబాణపరంపరలచేఁ బొడిపించుకొనవలసివచ్చుట నాకు మిక్కిలి శోచనీయముగా నున్నది.

సామంతుఁడు—దేవరవారు వచించినది సత్యమే. సర్వదా విచారస్వభావుఁడగు మనప్రియంవదుఁ డిందునకై పరితపించును. ఈవిషయమున మిమ్ముల దేశమునుండి వెడలనడఁచిన మీయనుజునికంటె మీరే నిందాపాత్రు లని ప్రమాణపూర్వకముగా నుడువఁగలఁడు. ఈవనమున శరవేగమునఁ బ్రవహించు సెలయేటిదరి నొకవటవృక్షము గలదు. దానిపాదములు మెలికలుదిరిగి భూమియం దర్ధమగ్నములై కొంచెము కొంచెము గాన్పించుచు జలపానార్థమై క్రమక్రమంబుగ సెలయేటిలోనికిం జేరియున్నవి. అట్టితరుచ్ఛాయను మనప్రియంవదుఁ డొంటరియై పరుండియుండఁగా నేనును, మనయానందభూపతియు వానివెనుకప్రక్కఁ బ్రచ్ఛన్నులమై యొదిఁగి యుంటిమి. అంతట నాస్థలమునకు వేఁటకానిచేత శరవిద్ధమయిన యొకజింక మందనుండి చెదరి మిగుల నీరసస్థితితో వచ్చి చేరినది. అధిపా! అది నిశ్చయముగా శ్వాసవేగముచేఁ జర్మము లిచ్చునంతటి తీవ్రదుఃఖముతో నే



డ్చెను. దానికన్నులనుండి వచ్చుబాష్పకణంబు లొకదానివెంట నొకటి పందెమువైచుకొని పరుగెత్తుకొని వచ్చునట్లు బహువేగముతో నాసికాగ్రంబు వెంబడిని బ్రవహించుచున్నవి. ఇట్టి యవస్థయందున్న జింక ప్రియంవదుఁడు పరిశీలించి చూచుచుండఁ దనబాష్పపూరంబుచే నా సెలయేటిం బూరించుచున్నదో యనునట్లు దుఃఖించుచు నీటియొడ్డున నిలువంబడియె.

సింహ—ప్రియంవదుఁ డేమనెను? ఈవిషయమున నేదైన నొక నీతిని వెల్లడింపలేదా?

సామం—సందేహమేమి! అందుండి యుపమాసహస్రమును వెలువరించెను. తొలుత నే తటముల నొరయు నీటితోఁ బ్రవహించు నాస్రవంతియందు జింక తనకన్నీటినిఁ బూరించుటనుగూర్చి యిట్లు ప్రస్తావించెను.

మ. జగతిం గల్గినలోభమానవులు స్వేచ్ఛాభోగ్యభాగ్యంబులం
దగుచుట్టాలకె యాత్మవిత్తములు చెందన్ వ్రాయుచందంబునన్
మిగులం గట్లను దొట్టి పార్లి కడు బల్మిం బాఱు నియ్యేటి కో
మృగమా నీగురుబాష్పపూరముల నర్పింపంగ సాఫల్యమే! 24

మృదురాంకవములు గలదీనిసహచరము లగుజింకలగుంపెల్లను నిట్టి దురవస్థయం దున్న దని పరిత్యజింప నేకాకియై యుండుటం గూర్చి—

గీ. ఇలను వసియించుచున్న ప్రాణులకు నెల్ల
మానరానట్టి సహజధర్మ మిది యొకటి
సంపదల విందుఁగొను బంధుజాల మెందుఁ
దగులుకొనునాపదలయందు నవ్వఁ జెందు. 25

అప్పుడే తృప్తిగా నిచ్ఛమై పచ్చికలు మెక్కి క్రొవ్వి నిశ్చయముగా దానిగతి నారయకుండ గంతులువైచుచు దానిసమీపమునుండి స్వేచ్ఛగాఁ బోవుచున్న లేళ్లగుంపును జూచి యిట్లనెను.

గీ. చెడబలిసి క్రొవ్వి యున్న యోజింకలార!
పరువులెత్తుఁడు లోకులపాడి యిదియె
వాఁడితూపులు నోనాడ వాడి గుండె
చెదరి పడియున్న దీనిఁ జూచెదరె మీరు? 26

ఈవిధముగా నీతిని బోధించుచు దేశముయొక్కయుఁ బట్టణముయొక్కయు, ధర్మాసనముయొక్కయుఁ; తుదకు మనయీప్రస్తుత జీవితముయొక్కయు విగ్రహములను నీతివాగ్బాణపరంపరచే గ్రుచ్చుచుఁ బరద్రవ్యాక్రమణపరాయణులమనియుఁ గేవలదుర్మార్గులమనియు, మఱియు నింతకంటెను నీచమగువిషయమే మనస్వభావసిద్ధము లయిన స్వగృహములయందు నివసించుచున్న మృగసంతతిని భయపెట్టి చంపువార మనియు నిందించుచున్నాఁడు.

సింహ — అతఁ డిట్టిదీర్ఘాలోచనమున నుండఁగా విడిచి వచ్చితిరా?

౨. సామం — ప్రభువా! అట్లే చేసితిమి. అటులు మిక్కిలి విలపించుచున్న జింకమగూర్చి విమర్శించి పరితపించుచు లేచి వచ్చితిమి.

సింహ — నాకాస్థలముం జూపెదరా? ఇట్టిసమయములయం దాతనివిజ్ఞాన మెక్కుడుగా నుండుం గాన నాతనితో వాదింపఁ గోరుచుంటిని.

౧. సామం — చిత్తము దేవరవారిని వెంటనే యచ్చటికిం గొంపోదును.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

## 2-వ రంగము.

## రాజమందిరమున నొకగది.

(విక్రమసేనుఁడు సామంతులతోఁ బ్రవేశించుచున్నాఁడు)

విక్ర — వారి నొక్కఁడయినం జూడకుండుట సాధ్యమా! సాధ్యముకాదు. ఈసాహసకృత్యమునకు రాజసభయం దుండువార లెవరో దుష్టులు సహకారులై యుండితీరవలయును.



౧. సామం — వారల నెవ్వరయినఁ జూచితి మని చెప్పఁగా నేను వినలేదు. ఆమె శయనాగారమందలి పరిచారిక లామెను నిద్రపుచ్చి వెళ్లిరి. ప్రాతఃకాలమునఁ జూడ నాపర్యంకము కన్యాపహారియై కాన్పించెను.

౨. సామం — ప్రభువా! సర్వదా పరిహాసవచనములచే దేవరవారి నానందపఱుచు నర్మసచివుఁడుఁ గూడ నదృశ్యుఁ డయ్యెను. నిన్నఁటిదినమునఁ జారుమతీకమల లేలినవారిసమక్షమున బలిష్ఠుఁ డగునాస్థానమల్లుని జయించి బాహుబలమును వెల్లడించిన భీమబలుని రూపసద్గుణవైభవంబుల నభివర్ణించుచుండ రహస్యమున వింటి నని కమలయొక్క పరిచారిక యొప్పుకొనుచున్నది. మఱియును నారాజపుత్త్రిక లిరువురు నెందేగినను నాయువకుఁడు వారికి సహచారిగా నుండియుండు నని దానినిశ్చయము.

విక్ర — వానిసోదరుఁ డగుప్రద్యుమ్నునిఁ బిలిపింపుఁడు. ఉన్నయెడల వానిఁ గూడ. లేకున్న వానిసోదరు నైన రప్పింపుఁడు. ఆతనిని దనసోదరుని దీసికొని వచ్చున ట్లాజ్ఞాపించెద. త్వరలో రప్పింపుఁడు. బుద్ధిహీనలై పలాయమాన లైనయీకన్యకల నన్వేషించి పట్టితెచ్చుటయం దప్రమత్తులై యుండుఁడు.

(అందఱు నిష్క్రమింతురు.)

## 3-వ రంగము.

## ప్రద్యుమ్ననిగ్రహాంగణము.

(భీమబలుఁడును, సుమంతుఁడును బ్రవేశించుచున్నారు)

భీమ — ఎవరురా! అక్కడ.

సుమం — చిన్నదొరవారా! శాంతుఁడ వగునోయేలికా! నాముద్దులయ్యా! విజయభూపతి ఛాయాపటమా! ఇంకను నిచ్చట నేలయుంటివి? నీవేల సుగుణరాశి వైతివి! ప్రజలు నిన్నేల ప్రేమింపవలెను! నీవేల వినయబలశౌర్యసంపన్నుండ వైతివి! చపలచిత్తుఁ డయినవిక్రమసేనుని యాస్థాన

మల్లుని జయించుకుతూహలము నీకేల కల్గెను! నీవిజయవార్త వాయువేగము నవలంబించి నీకంటె మున్నుగనే గృహప్రవేశముచేసెను. కొందఱకు సద్గుణసంపత్తియే శత్రుప్రాయమయి విషమించు నని మీ రెఱుంగరా? అటులే మీయెడలఁ గూడఁ బరిణమించెను. వినయవంతుఁడ వగునోదేవా! నీసుగుణసముదాయము నీయెడలఁగూడ ద్రోహియై పరిణమించెను. అయ్యో! యెంతటిదుష్కాలము సంప్రాప్తమయినది. సత్స్వభావము తనయాధారమునే నిర్మూలము సేయుచున్నది.

భీమ—ఏమి యిట్లనుచుంటివి? సమాచారమేమి?

సుమం—అయ్యో! కష్టశీలుఁడా! ఈగుమ్మము దాఁటి లోనికి రాకుము. ఈయింట నీగౌరవాతిశయమును హరింపనెంచిన వైరి నివసించియున్నాఁడు. నీసోదరుఁడు; అట్లనరాదు. అతఁడు నీసోదరుఁడు కాఁడు. పుత్త్రుఁడు. అదియును సరికాదు. అతనితండ్రి యని నేను జెప్పఁదలఁచిన విజయభూపతి కతఁడు పుత్త్రుఁ డని నేను బిలువను. నీఘనతను గూర్చి విని సహింపక నేఁటిరాత్రి నీశయనాగారమును నీతోఁగూడ దగ్ధముసేయ సమకట్టెను. ఈప్రయత్నమున నాతఁడు నిగ్రహింపఁడేని నీప్రాణాపాయంబునకు ననేకమాయోపాయంబులు పన్నును. వానికుతంత్రములను వానిముఖముననే రహస్యముగ వినియుంటిని. ఇది గృహముకాదు. వధ్యాలయము. వీహ్యపడుము, భయపడుము, లోనికిం బోకుము.

భీమ—అయ్యో! సుమంతుఁడా! న న్నెచ్చటికిఁ బొమ్మనెదవు?

సుమం—నీ వెచ్చటికిఁ బోయినను సరే. ఈయింటమాత్ర మడుగువెట్టకుము.

భీమ—ఏమిది! నన్ను రాజమార్గములం దిరిగి తిరిప మెత్తుకొను మందువా? లేక నీచమును క్రూరమును నగు ఖడ్గముం జేపట్టి దారులం గొట్టి జీవయాత్ర గడపు మందువా? ఇంతకంటె నుపాయాంతరము గాన్పింపదు. సహజానురాగశూన్యుఁడును, క్రౌర్యప్రధానుఁడు నగునగ్రజునిక్రోధానలంబున దగ్ధుండ నైన నయ్యెదను గాని నాగతి యెట్లున్నను నే నిందునకొడంబడను.



సుమం—మీ రిట్లు దుర్వృత్తులం బ్రవేశింపఁ బనిలేదు. వార్ధకమున నాజీర్ణాంగములు సేవకవృత్తియం దసమర్థములు గాఁగా బలువురచే నిర్లక్ష్యభావమున నొకమూలకుఁ ద్రోసివేయఁబడు కాలమున నాకుఁ బోషణకర్తగా నుండుటకు నీతండ్రిగారివలన నే నార్జించిన వేతనమునుండి పొదుపుచేసి కూడఁబెట్టుకొనిన యయిదునూర్లకాసులు నాయొద్దఁగలవు. కావున వానిని నేకరింపుము. గగనసంచారములైన విహంగములకును, గుహాశయములం దుండుచటకంబులకును భోక్తవ్యార్థముల సమకూర్చు జగదీశ్వరుఁడే వార్ధకమున నాకాధారమగుఁగాక! ఇవిగోఁ గాసులు. ఇవి యన్నియు నీకిచ్చుచుంటిని. నన్ను మీసేవకునిగాఁ గైకొనుఁడు. చూచుటకు నేను వృద్ధుఁడనై కాన్పించినను బలమును, దార్ఢ్యమును గలిగియున్నాఁడను.

ఉ. జవ్వన మెక్కువేళ వ్యభిచారగతిం జరియించి కాని లోఁ
గ్రొవ్వున మద్యపూరములు గ్రోలియుఁ గాని యెఱుంగకుంట నా
కివ్వరవార్ధకంబు బలహీనతలేక యెసంగె, రోగముల్
దవ్వుగఁ ద్రోలి, శైశిరవిధంబున సౌఖ్యదమయ్యె నెంతయున్. 27

కనుక నన్ను మీతో రానిండు. మీవ్యాపారమున కనుకూలించు కార్యములును మీదేహమున కుపయోగించు నుపచారములును గూడ నొక యువకునిబోలి చేయఁగలను.

భీమ—ఓ దయావంతుఁ డయినవృద్ధుఁడా! పూర్వకాలసంబంధ మగుభృత్యకృత్యమందలి విశేషము నీయం దెంతస్పష్టముగాఁ గాన్పించుచున్నది. అప్పటిసేవకులు ప్రతిఫలం బపేక్షింపక కర్తవ్య మనియే తమస్వేదమును వెడలించెడివారు. ప్రకృతకాలపద్ధతులకుఁ దగినవాఁడవు కావు. ఇప్పటికాలపువారు వేతనాభివృద్ధి నర్థించియే కష్టించెదరు. అట్టివేతనాభివృద్ధి నొందుటనే

సోమరు లయ్యెదరు. నీ వట్లుకాదు. అయ్యో! వృద్ధుఁడా! నశింపఁబోవు భూరుహంబునకు దోహదం బొనర్చుచుంటివి. నీ వీదోహదంబునకుం దగినప్రతిఫలంబుగా నొక్కకుసుమం బైన నందఁజాలవు. సరే. నీవు చెప్పినట్లే మన ముభయములముఁ గలసి పోవుదము. ఈవిత్తంబు పరాయత్తంబు గానికమున్నే సుఖముతో జీవయాత్ర నడచు సామాన్యపద్ధతి నేని మన మేర్పఱుచుకొందము.

సుమం — అయ్యో! ముం దంజవేయుము. రాజభక్తితో సత్యవంతుఁడనై యావజ్జీవము నిన్ను సేవింప నీవెనువెంట వచ్చెదను. పదునేడువత్సరంబులప్రాయంబు మొదలు నేఁటివఱక నెనుబదివత్సరంబులపర్యంతము నేనీయింట నుంటిని. ఇఁక మీఁద నిచ్చట నుండఁబోను. పదునేడువత్సరంబుల వయస్సు గలిగినప్పుడే పెక్కండ్రు తమజీవితమున కనువగుమార్గమును జూచుకొందురు. ఇప్పుడు నాకుఁ గాలాతిక్రమణదోషము పట్టినది. అయిన నుపకారవేతనము దినువాఁడ నై వ్యర్థముగఁ గాలయాపనము సేయుట కంటె రాజసేనతోఁ గాలము వెళ్లఁబుచ్చుటయే గదా భాగ్యదేవత నాకుఁ గలుగఁజేయవలసిన ప్రతిఫలము!

(అందఱు నిష్క్రమింతురు.)

## 4-వ రంగము.

### నైమిశారణ్యము.

(వసంతుఁ డనుచారుమతియు, శుకవాణియను పేరఁ గమలయు, విదూషకుఁడును బ్రవేశించుచున్నారు.)

వసం — అయ్యో! దైవమా! నాయుత్సాహము శుష్కీభూత మగుచున్నది.

విదూ — నాపాదములు నొప్పు లెత్తకున్నయెడల నాయుత్సాహము లక్ష్యపెట్టను.



వసం — ఈపురుషాకృతి నవమానించుచు స్త్రీవలెనే నడువవలయు నని నా హృదయము నన్నుఁ బురికొల్పుచున్నది. కంచుకమునకంటెఁ గవచము ధైర్యవంతమై యుండవలయుఁ గాన నే నిప్పు డీయబలకు ధైర్యమొసంగెదను.

శుక — నీపుణ్యమాయె నన్ను భరింపుము. నే నింకముం దడుగు వేయఁజాలను.

విదూ — మిమ్ములను భరించుటకంటె మిమ్ముల నే భరించుటయే నాకుసమ్మతము. మిమ్ములభరించినను మీయొద్ద ధనములేదు గావునఁ దేలికయే.

వసం — ఇదియే నైమిశారణ్యము.

విదూ — ఓహో! నేనిప్పుడు నైమిశారణ్యమున నుంటినా? నేను మీతో వచ్చుట కంగీకరించినందున బుద్ధిహీనుఁడ నైతిని, నేనింటియొద్ద నుండినపు డింతకంటె మంచితావున నుంటిని. కాని పథికులు తృప్తినొందవలయును గదా!

వసం — అవును విదూషకా! నీవు చెప్పినది బాగుగనున్నది.

అటుచూడుము. ఎవరో యిటువచ్చుచున్నారు. ఒకయువకుఁడు, వృద్ధుఁడు దీర్ఘాలోచనము సేయుచు —

(అంగదుఁడు, భద్రుఁడు ప్రవేశించుచున్నారు)

అంగ — ఆమె నిన్ను మఱింత ద్వేషించునట్లు చేయుట కదియే మార్గము.

భద్రు — అయ్యో! అంగదుఁడా! నేనామె నెంతగాఁ బ్రేమించుచుంటినో నీవు గ్రహించిన బాగుగనుండును.

అంగ — కొంతవఱకు నూహింపఁగలను. ఏలయన, నేనును బూర్వ మొకప్పుడు ప్రేమించినవాఁడనే.

భద్రు — అంగదుఁడా! అట్లనకుము. నీవు యౌవనదశయం దుండునప్పుడు నిజమైన మోహము కలవాఁడవై యర్ధరాత్రంబునఁ దలగడపైఁ దలనుంచి దీర్ఘనిశ్వాసంబు లూర్చుచుండువాఁడ వైనను, నిప్పుడు వృద్ధుండ వగుటచే

నామోహపరిమితిని గ్రహింపఁజాలవు. నీప్రేమ నాప్రేమయంతటి ప్రబలమైనదే యైనయెడల నాయంతటిప్రబలమోహము నేపురుషుఁడును బొంది యుండఁడు. నీమోహము నీచే నెన్నిహాస్యాస్పదకృత్యములఁ జేయించి యుండెనో చెప్పుము ?

అంగ — నేనిపుడు మఱచిపోయితిని గాని వేనవేలు చేయించినది.

భద్రు — ఓహో ! అటులైన నీవెప్పుడును త్రికరణశుద్ధిగాఁ బ్రేమించియుండలేదు. ఎప్పుడయిన నీప్రేమ నీచేఁ జేయించిన స్వల్పవికృతకార్యములనైనను నీవు మఱచినయెడల నిజముగాఁ బ్రేమించినవాఁడవు కావు. నేను నిన్నిప్పుడు బాధించుచున్నటులు నీప్రేయసిని బొగడుటవలన వినువారిని నీవు విసికింపనియెడల నీవు నిజముగాఁ బ్రేమించినవాఁడవు కావు. నీవు నావలె మోహవికారమువలన మిత్రులనుండి తప్పించుకొని పోనుంకింపనియెడల నిజముగాఁ బ్రేమించినవాఁడవు కావు. హా ! ప్రేయసీ ! కలహశీలా !

వసం — అయ్యో ! వెఱ్ఱిగొల్లవాఁడా ! నీమనోవేదనను దెలిసికొనయత్నించి దురదృష్టవశమున నామోహస్థానమును గ్రహించితిని.

విదూ — నేను నాదానినిగూడఁ దెలిసికొంటిని. నేను మోహపరవశుఁడనై యున్నకాలమున నాకరవాలమును రాతిపై విసరి విఱుగఁగొట్టి రాత్రివేళ నాప్రేయసియొద్దకు వచ్చినందున కాతని కీదెబ్బలు నివేదించితిని. నేనొకప్పుడు నాప్రేయసి బట్టలుదుకురాతిని మఱియొకప్పుడు పగిలి బీఁటలువారిన చేతులతోఁ బాలుపిదుకఁబడుచుండు గోవుపొదుగును, ముద్దుపెట్టుకొంటినని జ్ఞాపకము. ఇంకొకప్పుడు నేను జిక్కుడుకాయను జేతఁబట్టుకొని దాని నాప్రేయసింగా భావించి దానికి నాప్రేమను నివేదించి దానినుండి రెండుగింజలను దీసి వానిని దిరుగ దానికిచ్చి నాయందు దయయుంచి వీనిని ధరింపవలయు నని కన్నీళ్లతోఁ బ్రార్థించితిని. నిజమైనప్రేమఁగల మన



బోంట్లు విచిత్రములైనపనులు చేసెదరు. కాని స్వభావమునం దంతయు నశింపవలసినదియే గాన నటులే స్వభావమంతయుఁ బ్రేమవిషయమున నాశమందఁదగినంత తెలివితక్కువగా నుండును.

వసం — నీకుఁ దెలిసినకన్న నెక్కుడు బుద్ధిమంతునివలె మాటలాడెదవు.

విదూ — అంతియకాదు. నేను దానికిఁ దగిలి పడుపాటువలన నెముకలు విఱుగఁగొట్టుకొనువఱకును నాబుద్ధిచాకచక్యమును గ్రహింపఁజాలను.

వసం — అయ్యో ! ఈగోపకుని మోహము సరిగా నాపద్ధతినే యున్నది.

విదూ — నాదియు నట్లే. కాని క్రమక్రమముగాఁ జప్పఁబడుచున్నది.

శుక — నేనాఁకలిచే మరణావస్థ నందుదానివలె నున్నాను. ఆతఁడు రొక్కముఁ గొని యన్నము పెట్టునేమో విచారింపుఁడు.

విదూ — ఏమోయి వనచరుఁడా !

వసం — బుద్ధిహీనుఁడా! నోరుమూసికొనుము. ఆతఁడు నీకు బంధువుఁడు కాఁడు.

అంగ — ఎవ్వ రాపిలుచువారు ?

విదూ — నీకంటె సాధ్యులే.

అంగ — కాకున్న వారు నీచు లగుదురాయేమి ?

వసం — నీపుణ్యమాయె నూరకుండుము, స్నేహితుఁడా నమస్కారము.

అంగ — అయ్యా! మీకువందనము. అయ్యలారా! మీకందఱకును వందనములు.

వసం — ఓగోపకుఁడా ! ఈయరణ్యమునం దౌదార్యమునఁ గాని, ధనముఁ గొని కాని నిలువ నీడయును భుజింప నాహారమును నొసంగు తావు గలదేని మాకుఁ జూపింపుము. ఈచిన్నది మార్గాయాసముచే బడలి కడు డస్సియున్నది. అసహాయురాలై సొమ్మసిలుచున్నది.

అంగ — ఓసౌందర్యరాశీ! ఈమెను జూచిన జాలి గలుగుచున్నది. ఈమెకు సహాయపడుటకైనను దగినద్రవ్యవంతుఁడ నగుదునేని బాగుగనుండును. నేను మేఁపుగొఱ్ఱెల రోమములవలనం గలుగుప్రతిఫలమయిన నాకుఁ జెందునది

కాదు. నేను మఱియొకనికి గొల్లలకాపరిని. నాయజమానుఁడు కడుం గోపస్వభావుఁడు. పరోపకారాదిధర్మాచరణమువలనఁ బరలోకసౌఖ్యమును గోరుసంతటి ప్రాజ్ఞుఁడు గాఁడు. ఇంతియకాక వానికుటీరంబులును, గొఱ్ఱెలమందలును, బచ్చికబయళ్లును విక్రయింప సిద్ధముగా నున్నాఁడు. మాయజమానుఁ డిచ్చట లేమింజేసి గొఱ్ఱెలసాలయందు మీరు తినఁదగు తినుబండారము లెవ్వియును లేవు. కాని వాస్థితిగతులకుం దగినయల్పాహారము నొసంగెదను లోనికి దయచేసి కలిగినదానితోఁ దృప్తినందుఁడు.

వసం—నీయజమానుని మందలును, బచ్చికబయళులును, గుటీరములుం గొనఁదలఁచినవా రెవ్వరు?

అంగ—ఒక్కనిమిషమువెనుక మీరిచ్చట నాతో మాటలాడుచుండఁగాఁ జూచిన యాటవికుఁడే. ఆతఁడు కొనుటయందంతశ్రద్ధఁ బూనువాఁడు కాఁడు.

వసం—వాని కట్టిగట్టిపూనిక లేనియెడల మనము కొనఁదలఁచినను మర్యాదాభంగము కాదు గావున మానిమిత్తమై వానిసర్వస్వమును గొనుము. క్రయధనమును మేమిచ్చెదము.

శుక—మేము నీకు వేతన మభివృద్ధి గావించెదము. నా కీప్రదేశము గడురమ్యముగానున్నది. ఇందుఁ గాలయాపనము సేయ నిచ్చగించుచుంటిని.

అంగ—నిశ్చయముగ విక్రయమునకు సిద్ధముగా నున్నవి. మీరు నాతో నేతెంచి యీభూములు సారవంతము లనితోఁచునెడలను, భూములవలని యాదాయము మీరిచ్చు క్రయధనంబునకు నర్హమని నచ్చినయెడలను, మీకీప్రదేశములు నివాసయోగ్యములుగా నున్నయెడలను, మీయొద్దనుండి క్రయధనముం గొంపోయి వానిని మీయధీనముం జేయుదును. నేను గడు విశ్వాసవంతుఁడనై మీమందలం గాంచుచుందును.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)



## 5-వ రంగము.

### అడవి.

(ఆనందుఁడు, ప్రియంవదుఁడు, మఱికొందఱుం బ్రవేశింతురు.)

ఆనం— గీ. శ్యామలపలాశభూరుహచ్ఛాయలందుఁ
గలసివాతోఁ బరుండి పక్షులకలస్వ
రములతోఁ గవకల్పి గీతములు పాడ
నిచ్చగలదేని రండు రం డెవ్వరైన
శిశిరకాలంబు దుర్భరశీతవాత
ములును దక్కంగ వేఱువైరు లిటలేరు.

ప్రియం—ఏదీ! ఇంకను. ఇంకను. ఇంకను.

ఆనం—ఓయీ ప్రియంవదుఁడా! నీకీపాటవలన విచారమును గలిగించినవాఁడ నగుదును.

ప్రియం—అట్లయిన నాకు సమ్మతము. దయచేసి యింకను. ఇంకను. గ్రుడ్లను బుక్కిటఁబెట్టి సర్పము వానిరసముం బీల్చినటులు నీగానమునుండి విచారము నాకర్షింపఁగలను. దయచేసి యింకను, ఇంకను.

ఆనం—నాకంఠము జీరవోయినది. నేను మీకానందమును గలుగఁజేయఁజాలను.

ప్రియం—నాకానందమును గలిగింపు మని కోరుటలేదు. గానముచేయు మనియే కోరుచుంటిని. ఏదీ, యింకొకగీతము పాడుము. మీరు వీనిని గీతము లనియే పిలిచెదరా?

ఆనం—అయ్యా! ప్రియంవదుఁడా! మీ రెట్లు పిలిచిన నట్లే యగును.

ప్రియం—వానిపేరులు నేను లెక్కసేయను. అవి యేవియు నాకునచ్చియుండలేదు. నీవు పాడెదవా?

ఆనం—నాసంతోషముకొఱకుఁ గాదుగాని మీకోరికిం జెల్లించుటకే.

ప్రియం—అటులైన బాగుగ నేయున్నది. నే నెప్పుడయిన నెవ్వరికయినం గృతజ్ఞతం బలుకు నెడల నీకునుం బల్కెదను. ఒకరినొకరు స్తుతియుక్తములైన ప్రపత్తులం జేయుచర్యం జూడ నాకు, రెండువేఁటకుక్కలు చేరి పోరాడుచున్నట్లు కాన్పించును. నన్నెవ్వరేని విశేషముగా శ్లాఘింతురేని యర్థార్థులై పొగడు వందిమాగధుల పొగడ్తగా నెంచెదను. ఇఁకఁ బాడుము. (ఇతరులవంకఁ జూచి) గానము సేయ నిమీరు నిశ్శబ్దముగా నుండుఁడు.

ఆనం—మంచిది. నేను గీతమును ముగించెదను. అయ్యలారా! మీరు భోజనమునకై పీఁటల నమర్చి భోజనపాత్రల నాసాదించుచుండుఁడు. రాజుగారీచెట్టుక్రింద నే ఫలహారము గావించెదరు. (దుఃఖాస్యు నుద్దేశించి) మనరాజుగారీనాఁడు నిన్నుఁ జూడఁ దిరుగుచుండిరి.

ప్రియం—ఈదినమంతయు వారికంటఁ బడకుండుటకుఁ బ్రయత్నించుచుంటిని. ఏలయన, ఆయన వాదశీలుఁడు. నా కది సరిపడదు. ఆయన ప్రకృతియం దెన్ని విషయములం గూర్చి విమర్శించునో నేనును నన్ని విషయములం గూర్చి విమర్శించువాఁడనే. కాని యట్టివానిం గూర్చి డంబములు చెప్పకొనక భగవంతునికిఁ గృతజ్ఞుఁడనై యుండెదను. సరియే. ఇఁక నుపక్రమింపుము.

ఆనం — గీ. అందరానట్టి కోర్కుల నంద పేయు
పడెడువారును దపనాతపమున కింత
వెఱపులేక యెడారులఁ దిరిగి భుక్తి
కై మృగంబుల వేఁటాడి యలరువారు
విధివిహితభోజ్యతతులఁ దృప్తిఁగనువారు
నిలను గలరేని రండు రం డెవ్వరైన
శిశిరకాలంబు దుర్భరశీతవాత
ములను దక్కంగ వేఱువైరు లిట లేరు. 29



ప్రియం—నాకవితాప్రాగల్భ్యమునకు సిగ్గుగలుగునటులు నిన్న నేనుగూర్చిన యొకగీతము నిచ్చెదను.

ఆనం—దాని నీవు చెప్పుము. నేను సరిగాఁ బాడెదను.

ప్రియం—అదీ యిట్లుండును.

ఉత్సాహ. నరుండు పట్టువట్టు నెమ్మనంబు దృప్తిగొల్పఁగా
ధరన్ ధనంబు సౌఖ్యమున్ విదల్చి యెవ్వఁడైనను
ఖరంబుగాఁగ మారి స్వేచ్ఛగాఁ జరించెనేని వాఁ
డరుంగరంబునాత్మతుల్యులైనబుద్ధిహీనులం
దిరంబుగా నిటం గనుం దధిం దధిం దధిం దధిం. 30

ఆనం—అయ్యా! అతకధీం, ఏమిటి?

ప్రియం—ఇది గీర్వాణమున బుద్ధిహీనుల నాకర్షించుమంత్రము. ఇఁకఁ బోయి నిద్రపట్టినఁ బండుకొనియెదను. లేదేని దక్షిణతీరమందలి లంకావాసుల నందఱను దిట్టిపోయుదును.

ఆనం—ఇచ్చట ఫలాహారసంభార మంతయు సంసిద్ధమైనది. కావున నేనేగి రాజుగారిని బిలిచికొనివచ్చెదను.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

## 6-వ రంగము.

### అరణ్యము.

(భీమబలుఁడు, సుమంతుఁడు, ప్రవేశించుచున్నారు.)

సుమం—ప్రియమైనయజమానుఁడా! నేనిఁకముందు నడువఁజాలను. అఁకలిచే నాప్రాణములు పోవుచున్నవి. నే నిచ్చటఁ బరుండి నాసమాధికి నలయుస్థలముం గొలిచెదను. దయామయా! నీకు శుభమగును గాక!

భీమ—ఏమది సుమంతా! ఇప్పు డెట్లున్నది? నీహృదయంబున నించుకంతయు గాంభీర్యము లేదా? కొంచె మోపికవట్టుము. కొంచె మూఁడిల్లుము; కొంచెమునేపు ప్రాణములు నిలుపుకొనుము. అగమ్యగోచర మగునీయర ణ్యమున నెద్దియైన మృగముండిన దానిని నీకాహారముగఁ గొనితెచ్చెదను. లేదా దానికి నాదేహము నాహారముగా నిచ్చెదను. నీదేహబలముకంటె మనోవికారమే మరణము నెక్కుడుగా సమీపించుచున్నది. నాకొఱకై నను గొంచెము విశ్రాంతినొందుము. మృత్యుదేవతను గొంచెమునే పాక బారెఁడుదూరమున నిలుపుము. నేనిప్పుడ మరలి వచ్చెదను. నీకేదేని యాహారముం దేఁజాలనిచో నీవు మృతినొందుటకు సెలవొసంగెదను. కాని నేను రాకమున్నె నీవు మరణించినచో నాశ్రమను బరిహసించిన వాఁడ వగుదువు. (సుమంతుఁడు ముఖవికాసముఁ జూపుచున్నాఁడు.) బాగుగానున్నది. నీవు కొంచెము ధైర్య మవలంబించినవాఁడవు గాఁ గా న్పించుచున్నావు. త్వరితముగా మరలివచ్చెదను. కాని నీవిచ్చటఁ జలి గాలిలో నుంటివి. నిన్నెచ్చటకైనను మఱుఁగునకుం గొంపోయెదను. ఈ విపినమం దెద్దియైన జీవజంతు వుండినచో నీవాహారములేక మృతినొందవు. ధైర్యమవలంబించి నిశ్చలముగ నుండుము.

(వృద్ధునితో నిష్క్రమించుచున్నాఁడు.)

## 7-వ రంగము.

## అరణ్యము.

(భోజనపాత్రము లమర్పఁబడియుండును, సింహకేతుఁడు, ఆనందుఁడు, సామంతులు, ఆటవికవేషమునఁ బ్రవేశింతురు.)

సింహ—ప్రియంవదుఁ డరణ్యమృగముగ మాఱి యుండవోపు. ఎచ్చట నాకఁ డొకమనుష్యునివలెఁ గాన్పించుటలేదు.



౧. సామం—ఓయేలికా! ఇప్పుడే యిచ్చటనుండి వెళ్లియున్నాఁడు. ఇచ్చట నున్నపు డొకగీతమును వించు నానందించుచుండెను.

సింహ—గుణములచే నైకమత్యములేని యీతఁడు, స్వరములచే నైకమత్యము గలసంగీతముచే నానందించె నేని నైకమత్యప్రధాన మయినగ్రహసముదాయమునకుంగూడఁ బార్ధక్యము సంభవించును. నే నతనితో ముచ్చటించుట కభిలాషముతో నుంటి నని చెప్పి తీసికొని రండు. (ప్రియంవదుఁడు ప్రవేశించును.)

౧. సామం—ఆతఁ డిచ్చటకే వచ్చుచుండుటచే నాశ్రమ నివారణమైనది.

సింహ—ఓహో! ఏమిది! దుఃఖాస్యుఁడా! నీజీవితచరిత్ర చిత్రముగా నున్నది. నీబీదస్నేహితులను నీసమావేశంబున కుబ్బూఁతలూఁగువారినిగాఁ జేయుచుంటివి. నీవేమో యానందభరితునివలెఁ గాన్పించుచున్నావు.

ప్రియం—ఉ. నేఁడు విదూషకుం డలవనింగనిపించె వికారరూపమై
వేడుకఁగొల్పు వస్త్రములఁ బ్రీతి ధరించి ధరాతలంబుపై
వేఁడిమి మించు నెండపొడ వెన్నెలరీతిఁ బరుండి యుండి, తా
వేఁడుచునుండె నయ్యెడ నవీనమ్మదూక్తుల భాగ్యదేవతన్.

విదూషకుఁడా! నీకు నమస్కార మని నేనంటిని. అందుకువాఁడు—అట్లు కాదు. దేవుఁడు నాకు భాగ్యము ననుగ్రహించువఱకును నన్ను వి—దూషకుఁ డనిపిలువకుము. అనియెను. పిమ్మటఁ దన జేబునుండి యొకగడియారపుబిళ్లను దీసి కాంతివిహీనమైన దృక్కులతో దానిం జూచి జ్ఞానయుక్తముగా నిట్లనియెను. ఇప్పుడు పదిగంటలైనది. దీనివలనఁ బ్రపంచ మెట్లునడచుచున్నదో మనము కనిపెట్టవచ్చును.

గీ. గంటక్రిందటఁ దొమ్మిదిగంట లయ్యె
గంటమీఁదఁ బదునొకండు గంటలగును
గంటగంటకు వృద్ధియై గ్రాలి పిదప
గంటగంటకు క్షీణించి గడతు మనని.

దీనివలన గొప్పనీతి తెలియఁబడుచున్నదనియెను. విదూషకునివలన నిట్టి నీతి వాక్యములు వినినతోడనే విదూషకున కింతదీర్ఘాలోచనము గలుగునా యను నాశ్చర్యముతో నాశ్వాసకోశమునుండి కోడికూఁతవలె నొకవింతయైన ధ్వనివెలువడి, వానిగడియారపుబిళ్లయం దొకగంటకాల మెడతెఱపి లేక నవ్వితిని. ఆహా! కడుఁజిత్రమైన విదూషకుఁడు. విదూషకుఁ డగుటకన్న భాగ్యమెద్ది?

సింహ — వీఁ డెవఁడై యుండవచ్చును?

ప్రియం — ఇతఁడు కడుయోగ్యుఁడు. ఇంతకుమున్ను రాజసభలో మెలఁగిన వాఁడు. ఆతఁడు "యువతీజనము లేఁబ్రాయము, సౌందర్యము గలిగి యుండినయెడల వానిని గ్రహించుశక్తియును గలిగియుందురు." అనియెను. చిరకాలప్రయాణములలో మిగిలి శుష్కీభవించియున్న దోసెఁ బోలె యున్నవాని మొగమునం దచ్చటచ్చటఁ జిరకాలానుభవసిద్ధము లైనగొప్ప విజ్ఞానాంశము లిమిడియున్నవి. వాని నప్పుడప్పుడు తనసమాజమువలన వక్రీక్షణములచే నెల్లఁ గ్రక్కుచుండును. ఓహో! నేను విదూషకుండ నైన నెంతబాగుగా నుండును! వానివేషమునే ధరించుకొనుటకు నాకుఁ జాల ముచ్చటగానున్నది.

సింహ — అట్లే ధరింతువుగాక!

ప్రియం — కాని యింతకుమున్ను నేను బుద్ధిశాలి నని తమకుఁ గలిగినయూహలం గట్టిపెట్టి యింతటనుండి కేవలవిదూషకునిగా నన్నెంచుటయే నా ముఖ్యమయిన కోరిక. మఱియు నెల్లవారియెడలను వాయువునకుం గలిగినంతటి నిరంకుశప్రచారమున కనుజ్ఞ యొసంగవలయును. రాజసభలయందలి విదూషకుల కట్లే యొసంగుచుందురుగదా! ఎవనియందు నావిదూషకభావము విశేషముగాఁ బ్రయోగింపఁబడునో వాఁడే నాయెడల మందహాసముతో నుండవలయును. అట్లేల యని ప్రశ్నింతురేమో? అంపలిసమా



ధానము మంగళగిరిగాలిగోపురమువలె స్పష్టముగాఁ గానఁబడుచున్నది. నాచేఁ బరిహసింపఁబడిన యెవ్వఁడయిన నాపరిహాసమువలన నైనపరాభవము గ్రహించియుఁ దన్నుఁ గానట్టు నటింపవలయునే గాని పోరాటమునకు సమకట్టునెడల వాఁడు కడు బుద్ధిహీనుఁడై పరిగణింపఁబడును. అట్లు కానియెడల విలాసమాత్రమున నాడినపరిహాసవాక్యములఁగూడఁ దమయం దారోపించుకొని బుద్ధిమంతులుగూడ హాస్యాస్పద మగుదురు. ఇంక నాకు విదూషకనైపథ్య మనుగ్రహింపుఁడు, నాకు నిరాఘాటవాక్ప్రచారమునకు సెలవిండు.

శా. సారాచారములెల్లఁ జేట్పడి, దురాచారావళీరోగముల్
తోరంబై వెడలంగఁబారి ముఱుఁగం దుర్వాసనావాసితం
బై, రూపంబఱు, నియ్యజాండ మనుదేహం బెల్ల మన్నీతివా
గ్ధారాపూరరసాయనంబు లిడి శుద్ధస్ఫూర్తి శ్లాఘింతెదన్. 33

సింహ — చీ, చీ, యూరకుండుము. నీవు చేయఁదలఁచిన విషయము నాకుఁ దెలిసినది.

ప్రియం — ఏ మట్లనుచుంటిరి? నేను బందెమువైచి చెప్పఁగలను. మంచిని గాక చెడ్డ నెన్నఁడయినఁ జేయుదునా!

సింహ — ఉ. పాపుల దూఱి లోకమును బాగుగఁ జేసెదనంచు నీదుదు
ర్వ్యాపృతులెల్ల నెల్లెడ బయల్పడఁజేసిన నష్టకారి యౌ
పాపమె కాని లాభ మొకపాటియు లే దది యెట్లు, యౌవనో
ద్దీపనవేళ నీవు కడుఁ ద్రిప్పరమన్మథతంత్రఖేలనే
చ్ఛాపరవృత్తిఁ బైకుబుకసాగు వ్రణంబులు నొప్పుదుర్గతుల్
ఖ్యాపనసేసి యిక్కరణి నన్నెము పున్నె మెఱుంగనట్టి ని
ష్పాపమహాప్రజావళికిఁ బాపములం గఱపింతువే ఖలా. 34

ప్రియం — గర్వమునుగూర్చి నే నొకయుపన్యాసము నిచ్చినచో నయ్యది

నాకే వర్తించు నని యెవ్వఁడు నన్ను నిందించును ? నాయుపన్యాసము నెవ్వఁడయినఁ దనయం దారోపించుకొని కలహింపవచ్చిన యెడల వానిని ముంచివేయునంతటి మహాసముద్రప్రవాహప్రాయమై యీగర్వ విషయకోపన్యాసము పరిణమింపదా ! మఱియు సార్వభౌమాంతఃపురాంగనా ధారణానురూపంబులైన చిత్రాంబరాభరణాదివస్తుకలాపంబుల ననర్హలైనపురకాంతలు ధరించుట నింద్యమని నే నుపన్యసించినయెడలఁ దనయిరుగుపొరుగువారందఱు నట్లే సంచరించుచుండ నెవ్వతె తనపై నారోపించుకొని నాపైకి రాసాహసించును. స్వల్పాదాయములోనివా రనల్పములైన వస్త్రములు ధరించుట యుక్తముగా దని నేనుపన్యసించు నెడ నేసాధారణ మనుజుఁడు మావస్త్రములకై నీసొమ్మేమి వ్యయపఱిచితి వని నన్నధిక్షేపించునో వాఁడు తనలోపమును జెప్పకయే చెప్పినవాఁ డౌనుగదా ! ఇఁక నైనదా ? ఇఁక నేమి ? ఇఁక నెట్లు ? నాయుపన్యాసము లోకము నెట్లు బాధించుచున్నదో నాకు వివరించిచూపుము. నాయుద్యమము లోకమున కుపకారకారియే యైనచో నాపక్షమున లోకము దన్నుఁ దానే నిందించుకొనవలసియుండును. లోకము నాయుపన్యాసమునకుఁ బాత్రము గానియెడల నాపక్షమున నావాక్యము లెవ్వరిని బాధింపక యడవిపాపురంబులు వోలె నెవ్వరికిని వర్తింపకుండును. కాని యెవరా వచ్చుచున్నవారు ?

(భీమబలుఁడు కోశోద్ఘాత మైనఖడ్గముతోఁ బటాక్షేపముగాఁ బ్రవేశించుచున్నాఁడు.)

భీమ — ఆఁగుఁ డాఁగుఁడు. ఇఁక నొకకబళ మైనను భుజియింపవలదు.

ప్రియం — అయ్యో ! నే నొకముద్దయినను దినలేదే !

భీమ — మా యవసరము గడచువఱకుం దినఁ జెల్లదు.

ప్రియం — ఈపుం జేజాతిలోఁ జేరినది ?



సింహ — ఉ. ఓసహనారుణాక్ష ! భవదుద్ధతపద్ధతిఁ జూడఁజూడ ర
క్షోదనుజప్రచారములచొప్పు గనంబడె నార ! లోకమ
ర్యాద లెఱుంగవో, యెఱిఁగియైనను వేఱుగతిన్ లభింపకీ
చైదముఁ బూనినాఁడవొ, విచక్షణవృత్తి నెఱుంగఁ బల్కుమా,

భీమ — మొదటివాక్యముననే నామనస్థితిని దెలిసికొనినవాఁడ వైతివి. ఉపాయాంతరము లేని ప్రాణవ్యథ యనుకంటకము నాదేహముం బొడిచి నాయందుఁ గలసౌజన్యమును దీసివైచినది. నేను దొలుతనుండియు నాగరకతగలదేశమునఁ బెంపఁబడినవాఁడ నగుటచే సౌజన్యమును బాగుగా గుర్తెఱుంగుదును. అయినను నావ్యాపారము కొనసాగించువఱకు నిం దొక్కఫలమైన భక్షించువాఁడు నాచేతఁ జావకతీరదు. కావున భక్షింపకుఁడు.

ప్రియం — నీవు న్యాయమగు రీతిని దృప్తి నందనియెడల నేను జావవలసినవాఁడనేనా !

సింహ — నీ కేమికావలయును ? మాయెడల నీవిక్రమాతిశయముకంటె నీనమ్రస్వభావమునే యుపయోగించిన నింతకన్న సుకరముగానే నీయభీష్టము నెఱవేఱునుగదా !

భీమ — ఆఁకలిచేఁ బ్రాణములు పోవుచున్నందున నాకీఫలంబుల నొసంగుఁడు.

సింహ — రండు. మాపంక్తినిఁ గూర్చుండి భుజింపుఁడు.

భీమ — ఎంతమృదువుగా మాటలాడుచుంటిరి ! నన్ను క్షమింపవలయు నని ప్రార్థించుచున్నాఁడను. ఇచ్చట నుండువారెల్లరు నాటవికులే గదా యనిభావించి యింతటి దౌష్ట్యారంభమునకుం బూనుకొంటిని. మీ రెవ్వరయినను మనుష్యసంచారమున కనర్హ మగునీయరణ్యమునఁ జీఁకటులు గ్రమ్ముశాఖిశాఖాచ్ఛాయయం దనుక్షణమును నిర్గమించుచుండు కాలము యొక్కగంటల నశ్రద్ధగాఁ బోఁగొట్టుకొనుచున్నారు.

సీ. ఎన్నఁడైనను మీర లున్నత దశయందు
నర్తించిదీపించువారలేని
లలితఘంటారవంబులఁ బిల్చుచుండుదే
వస్థలంబుల నిల్చువారలేని
మన్నింపఁదగు మహామహాగృహంబులవిందు
లారగింపఁగఁ బోవువారలేని
లోచనంబులనుండి తోఁచుబాష్పకణంబు
లారంగఁ దుడిచినవారలేని
గీ. యొకనిఁ గడు నాదరించి వేఱొకనిచేత
నాదరింపంగఁబడినట్టి యర్థులేని
వినయమే కార్యసాధన మని తలంచి
సిగ్గుపడి ఖడ్గ మిపుడె దాఁచెదను గాక ! 36

సింహ—మేము నున్నతదశ ననుభవించినవారమే, పవిత్రమైన దేవాలయపు గంటలచేఁ బిలువఁబడినవారమే, గొప్పవారియింట విందుల నారగించిన వారమే. జాలివలన వెడలినబాష్పబిందువులను దుడుచుకొనినవారమే. కావున సుఖాసీనుఁడవై నీకొఱఁతను బూర్తిచేయఁజాలిన దంతయు మాకుఁ గలిగినదానినుండి యథేచ్ఛముగా భుజింపుము.

భీమ—అటులయిన భోజనమునుండి క్షణకాల మాఁగుఁడు. ఈలోపున నాఁడుఁబిచ్చుకఁబోలె నాపిల్లను వెతకికొనుచు నాహార మందిచ్చివచ్చెదను. లేమిచేతను ముదిమిచేతను బీడింపఁబడుచు నాయందలి యకారణస్నేహముచే నీరసమున నడుగులు తడఁబడఁ గుంటుకొనుచు నావెనువెంట బహుదూర మరుగుదెంచిన యొకపురుషుఁడు కలఁడు. వృద్ధత్వము క్షుధయును నను రెండు నీరసమును గలిగించు కష్టములచే నణఁగఁద్రొక్కఁబడుచుండు నీతనికి మున్ను దృప్తి గలిగింపక నే నాహారమును స్పృశింపఁజాలను.



సింహ—నీవుపోయి వానిని దోడ్కొనిరమ్ము. నీవు తిరిగి నచ్చువఱకును మేము వీనిని వ్యయపఱుపకుండ భద్రముగాఁ గాపాడెదము.

భీమ—మీకు నేను గృతజ్ఞుఁడను. ఇట్టి సద్గుణరాసు లగు మిమ్ములను భగవంతుఁ డనుగ్రహించును గాక !

(భీమబలుఁడు నిష్క్రమించును.)

సింహ—కష్టానుభవము విషయమై మన మేకాకులము కామని మీరీచరిత్రము వలనఁ దెలిసికొనవచ్చును.

గీ. విస్తృతాజాండనాటకవిపులరంగ
సీమలో మనచేఁ బ్రదర్శితములైన
యంకముల కన్న మిగుల దుఃఖాకరంబు
లైన యంకంబు లిఁకఁ బెక్కులై తనర్చు. 37

ప్రియం—సర్వప్రపంచము నొకనాటకరంగము, స్త్రీపురుషులందఱుం బాత్రమాత్రములు, జననమరణములు ప్రవేశనిష్క్రమణములు. ప్రతిపురుషునిజీవితమును నేడుభాగములుగా విభజింపఁబడియుండుటచే నానారససంకీర్ణమయిననటనముం బ్రదర్శించుచుండును.

1. గీ. శైశవంబున, దాదిరక్షణమునందు
రుగ్మతలచేత నగుబాధ రోసి యడలి
యాఁకలికి నేడ్చి పాల్గ్రోలి యలరుచుండు

2. బాల్యమునఁ బాఠశాల కంపంగ, మదికి
సమ్మతములేక, మూల్గుచు, స్నాతుఁడగుట
కోమలంబైన రూపుతోఁ, గుటిలమైన
చిలువనడకల నడచుచు, గళమునందుఁ
బొత్తములసంచిఁ దగిలించి పోవుచుండు.

3. యౌవనంబునఁ దనప్రియురాలిఁ గూర్చి
ప్రార్థనాగీతములఁ వ్రాసి పాడుకొనుచుఁ
గొలిమితిత్తులువోలె నూర్పులు నిగుడ్చు

4. విక్రమావస్థ మెయిఁ దాల్చి పెంచుకొనిన
మీసములు, బెబ్బులినిఁ బరిహాసమాడ
మాటిమాటికిఁ బందెముల్ దీటుకొనఁగ,
మానభంగంబు నొక్కింతయైనఁ గనక
చివ్వకును గాలుదువ్వుచు, జిఱుతగండు
నోటఁ దలఁదూర్చియైన సన్నుతిఁ దనర్చు
బుద్బుదప్రాయమౌ ఖ్యాతిఁ బొందఁజూచు.

5. న్యాయనిర్ణయదశనొంది యతిబలిష్ఠ
భోజనమ్మునఁ బెరిఁగిన పొట్టతోడ,
దృష్టితీవ్రతతోఁ గత్తెరింపఁబడిన
బవిరిగడ్డంబుతో నీతివాక్యములును,
బూర్వచారిత్రములును, జెప్పుచు మెలంగు.

6. వృద్ధదశనొంది, శుష్కించి, విపులవేష
మందుఁ బ్రమోదంబు మాని, ముక్కద్దములను
గనులధరియించి నిండుజవ్వనమునాఁటి
దుస్తులను భారముగనెంచి, తొలఁగఁజేసి,
జిలుఁగుదుస్తులఁదాల్చుచు, నెలుఁగుమాఱి,
కీఁచుగొంతుకతో నీల నైచుచుండు.

7. అంతకోన్ముఖదశఁ జెంది యంతసౌఖ్య
బాధ లెఱుఁగక, తలతిక్కపట్టు వట్టు,
జ్ఞప్తి దగ్గును, దృష్టివిజ్ఞాన మెడలు,



దంతములునూడు, రుచి తెల్వి, యంతమొందు,
నిట్లు సర్వేంద్రియజ్ఞానహీనుఁ డగుచు
సప్తదశలొందుదురు ధాత్రిసర్వజనులు. 38

(భీమభలుఁడు సుమంతు నెత్తుకొని ప్రవేశించును.)

సింహ—నీకు స్వాగతము. గౌరవార్హమైన నీభారము నచ్చట దింపి యాతని నాహారముం దిననిమ్ము.

భీమ—ఈవృద్ధునినిమిత్తము నేను గృతజ్ఞుఁడనై యున్నాఁడను.

సుమం—(భీమబలు నుద్దేశించి) నాస్వశక్తిచేఁ గృతజ్ఞతం దెల్పఁదగిన యవస్థయందు లేనుగాన మీరు తెల్పుటయే కర్తవ్యము.

సింహ—(సుమంతునుద్దేశించి) నీకు స్వాగతము. ముందుగా నిన్నుఁ గుశలప్రశ్నలవలన నలయించుటకు నే నిష్టపడను. కావున నీ వీఫలాహారముం గొనుము. పిమ్మట నే ముచ్చటించుకొందము. (ఆనందు నుద్దేశించి) యోగ్యుఁడవయిన సోదరుఁడా! నీగానామృతముచే మమ్మానందపఱుపుము.

ఆనం—ఉ. శీతలవాతమా! మిగులఁ జెందుము చెందు మిఁకెట్టులైన దు
ర్నీతి కృతఘ్నుకన్నఁ గడు నిర్దయవృత్తివి గావు, నీసమా
ఘాతము సోఁకినం గటువుగాఁ గనిపించిన, నీ వదృశ్యవున్
భూతమ వౌట గ్రుచ్చుకొనఁ బోలవు నీయురుదంష్ట్ర లెంతయున్. 39

సీ. "ప్రాపంచికస్నేహభావ మాభాసంబు
కాంతకాంతానురాగంబుసున్న
భక్తియుక్తంబుగా భజనసల్పుటమేలు
జన్మ మానందవిస్తారకంబు
క్రూరశీతగుణప్రచారావకాశమా
మమ్ముల ముద్దగామార్చు మార్చు

మలకృతఘ్నత యంతబలసత్తరంబుగాఁ
జలపట్టి వేధింపఁ జాలవీవు,
గీ. అంబువుల గడ్డఁగట్టించునట్టిశక్తి
వనరి యున్నను బరసుకృతంబు మఱచు
నట్టి విశ్వాసఘాతుకునంత నీవు
శైత్యమా మమ్ము వేధింపఁజాలవు సుమ. 40

సింహ—(భీమబలు నుద్దేశించి) నీవు నిశ్చయముగా విజయభూపతిపుత్త్రుఁడ వని రహస్యముగాఁ దెల్పియుంటివి కావున, నట్లే యగునేని నీముఖమునఁ బ్రతిబింబముగాఁ గానఁబడుచుండు నీతండ్రియొక్క విగ్రహమును నా కన్నులారఁ జూచుచుంటిని గావున నిశ్చయముగా దగ్గఱకు రమ్ము. (దగ్గఱకుఁ జేరఁదీసి కొనుచు) నాయనా! నీతండ్రిని విశేషముగాఁ బ్రేమించిన రాజను నేనే. కావున నీవు నాతోఁ గూడ నేను నివసించుగుహాంతరమున కేతెంచి యిప్పటికి నీకుఁ బోఁగామిగిలియున్న స్థితిగతులను నాకెఱిఁగింపుము. (సుమంత్రు నుద్దేశించి) యోగ్యుఁడ వగువృద్ధుఁడా! నీయజమానుని వెంట నీవు మాతో రావచ్చును. (భృత్యునిఁ జూచి) ఈవృద్ధునికిఁ జేయూఁత యొసంగుము. (వృద్ధు నుద్దేశించి) నీకైదండ నా కొసంగుము, (అని వృద్ధుని బాహువునఁ దనబాహువునుంచి పట్టుకొనుచు) నీయోగక్షేమములను నన్నుఁ దెలిసికొననిమ్ము.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది ద్వితీయాంకము.



శ్రీ

# చారుమతీపరిణయము.

## తృతీయాంకము.

### 1-వ రంగము.

రాజమందిరములోని యొకగది.

(ప్రవేశము—విక్రమసేనుఁడు, సామంతులు, ప్రద్యుమ్నుఁడు.)

విక్ర—అప్పటినుండియు మీరు వానిని జూడనేలేదా! అయ్యో! ఇది కేవలమసత్యము. నేను దయాస్వభావుఁడనే కానియెడల నెదుట నున్ననిన్ను వదలి దూరస్థుఁడై యున్ననీతమ్ముని వెదుక నేల ప్రయత్నించెదను? నీ సహోదరుఁ డెచ్చట నున్న వెదకి తీసికొనిరమ్ము. జాగ్రత్త! కంచుకాఁగడా వైచి పరిశీలింపుము.

సీ. కరుణించి యొకయేఁడు గడు వొసంగితినీకుఁ
దఱిలోన నీసహోదరుని మాకు
జీవితు నైన నిర్జీవితు నైన మా
యెదుటఁ బెట్టుము పెట్టవేని నీకు
మారాజ్యమున నెందు మనఁగడసున్న మా
యాజ్ఞను నెఱవేర్చునంతవఱకు
నీగురుక్షేత్రవిత్తాగారసౌధాది
సర్వస్వమును మావశంబుఁ జెందు,

గీ. మాకు నీయెడఁ గల యనుమానకార
ణంబు నీసహజన్మముఖంబువలనఁ
దెల్ల మగుదాఁక నొకపూరిపుల్లయైనఁ
గాని యొసఁగము పొమ్ము మాయాన సుమ్ము. 41

ప్రద్యు—దేవా! నానిజమైన మనస్థ్సితి మీరెఱిఁగిన బాగుగా నుండును. నే నాతని నెన్నఁడును ద్వేషించువాఁడనే గాని ప్రేమించి యెఱుంగను.

విక్రమ—అట్లయిన నీవు మఱియుఁ బరమదుర్మార్గుఁడవు గాఁ గాన్పించుచున్నావు. సరే. (భటునివంకఁ జూచి) సేవకా! వీని నావలికి గెంటివేయుము. మనరక్షకభటులను బంపి వీని గృహారామక్షేత్రవిత్తాది సర్వస్వంబును స్వాయత్తంబు చేసికొని వీనిని లోనికి రానీయక తఱిమివేయవలసినదిగా మే మాజ్ఞాపించితి మని సచివోత్తమునితో నివేదింపుము. తత్క్షణ మట్లు చేయుము. రమ్ము.

(అందఱు నిష్క్రమింతురు.)

## 2-వ రంగము.

## అరణ్యము.

(భీమబలుఁడు, చేత నొక కాగితముం బుచ్చుకొని ప్రవేశించుచున్నాఁడు.)

భీమ—(ప్రవేశించి) ఓనాపద్యమా! నాకుఁ గలప్రేమకు సాక్షివై నీవీచెట్టున వ్రేలాడుచుండుము. (అని తనచేత నున్న కాగితమును జెట్టునకుం గట్టి, యాకసమువంకఁ జూచి)

గీ. కడఁగి నాజీవనము నరికట్టినట్టి
చారుమతిని భవత్సమాస్యను లిఖించి
నట్టిపత్రికఁ జెట్టునఁ గట్టినాఁడ
విమలనిలయంబునుండి గాంచుము శశాంక! 42



గీ. పొలఁతి! యీభూరుహములె నాపుస్తకములు
చెలఁగి నాయూహ లెల్ల నీచెట్లపట్ట
లందుఁ జెక్కెద, దాన నీయడవి వంకఁ
జూచు ప్రతినేత్రమును నీదు సుగుణగణము
గాంచి యాశ్చర్యరసనిమగ్న మగుఁగాక. 43

భీమబలుఁడా! పరువెత్తుము. పరువెత్తుము. సౌందర్యరాశియు, సుగుణఖనియు, వర్ణనాతీతయు, నగుచారుమతియొక్క నామమును బ్రతివృక్షస్కంధముల యందును శిల్పన మొనర్పుము. (పరిక్రమించును.)

(అంగదుఁడును, విదూషకుఁడును బ్రవేశింతురు. భీమబలుఁడు నిష్క్రమించును.)

అంగదు—అయ్యా! విదూషకుఁడు గారూ! ఈ మాగొల్లమనుగడ మీకెట్లు గాఁ దోఁచుచున్నది?

విదూ—ఓరి! గొల్లవాఁడా! నిశ్చయముగా మనుగడమట్టుకు బాగుగనే యున్నది. కాని గొల్ల లను పేరుఁ జేర్చుటచే వ్యర్థమయినది. ఇది నిర్జన మగుటచే ననుకూలముగానే యున్నది గాని నిగూఢమగుటచే నీచముగా నున్నది. సుక్షేత్రమం దగుటచే సంతోషముగానే యున్నది కాని ధర్మాసనమునఁ గాకుండుటచే విసుగుఁదలగా నున్నది. అల్పాహార మగుటచే నారోగ్యముగానే యున్నది. కాని తృప్తిమంతము కాకుండుటచే నాపోవుట లేదు. నీలో నేమైన వేదాంత మున్నదా గొల్లవాఁడా!

అంగ—ఒకనికి రోగము పెరిఁగినకొలఁది నోర్పు తగ్గుచుండును. రొక్కమును నాధారమును, దృష్టియుఁ గొఱఁత యైనవాఁడు ముగ్గురు నేస్తులు లేనివాఁడు. వాన తడుపును; అగ్గికాల్చును; బీళ్లుముమ్మరముగా గడ్డిపట్టిన గొఱ్ఱెలకుఁ గండపట్టును. రాతిరి వచ్చుటకుఁ బ్రొద్దు గ్రుంకుటయే గొప్ప కారణము. చమత్కారము, విద్దెయు నబ్బనివాండ్రు పెద్దలు చిన్నప్పుడు

గారముచేసి చెడఁగొట్టి రనియు, లేక జీవకుటుంబములోనివాండ్ర మగుటచే నబ్బులే దనియుం జెప్పుచుందురు. ఇదియే నాకుఁ దెలిసినవేదాంతము.

విదూ—ఇట్టివాఁడవు సహజజ్ఞాని. గోపకుఁడా! నీ వెప్పుడయిన రాజసంస్థానమున నుంటివా?

అంగదు—నిజముగా నే నెప్పుడు నుండలేదు.

విదూ— అటులైన నీవు నరకమునకుఁ బోఁదగినవాఁడవే.

అంగదు—అట్లుకాదు. నేను—

విదూ —ఒకవైపున మాఁడి రెండవవైపునఁ గమలియున్న కోడిగ్రుడ్డువలె నీవును దప్పక నధోగతిపా లగుదువు.

అంగదు—రాజసభయం దుండకున్నంతమాత్రమున నేనా యీకారణములు?

విదూ—ఎందుకు—వినుము. నీవెప్పుడును రాజసభలయం దుండనియెడల సద్వర్తన మబ్బదు. సద్వర్తన మబ్బనిచో దుష్ప్రవర్తన మలవడును. దుష్ప్రవర్తనమునఁ బాపమును, బాపమువలన నరకమును సిద్ధించును. గొల్లవాఁడా! నీవు కడు దుస్థితిలో నుంటివి.

అంగదు—విదూషకుఁడా! అ ట్లింతమాత్రమును గాదు. పల్లెటూరివాండ్ర నడవడి కొలువుకూటమువారి కెట్లు నవ్వుటాలగా నుండునో కొలువుకూటము వారిది పల్లెటూరివారి కట్లే వెక్కిరింతగా నుండును. నీవు కొలువుకూటమువారు దండములకు బదులు చేతులు ముద్దుపెట్టుకొందు రని చెప్పియుంటివి. అక్కడివారు గొల్లలే యైనచో మిక్కిలి రోఁతగా నుండును.

విదూ—ఏది? ఉదాహరణము. రా! క్షిప్తముగాఁ జూపుము.

అంగదు—ఎందుకయ్యా! మే మిప్పటికిని నాఁడుగొఱ్ఱెలను ముట్టుకొనుచుందుము. వానిచర్మములు జిగురుగానుండును. నీవెఱుఁగవా!

విదూ—రాజసభలోనివారి చేతులుమాత్రము చెమటపట్టవా? గొఱ్ఱెలజిడ్డు



మనుష్యులచెమటకంటెను నేహ్యముగా నుండునా? ఇది చాలదు. చాలదు. రమ్ము. ఇంకొక మంచియుదాహరణమును జూపుము.

అంగ—ఇంతియే గాక మాచేతులు కడుమొరటుగా నుండును.

విదూ—నీపెదవులే వానిని శీఘ్రముగా గుర్తింపఁగలవు? ఊఁహూఁ! ఇదియును జాలదు. ఇంతకంటె మంచిపునాది గలయుదాహరణముఁ జూపుము.

అంగ—మఱియును నాగొఱ్ఱెల పుండ్లకు మందులు తఱచు రాయుచుండుటచే మాచేతులు కిలముపట్టి వన్నెమాసి యుండును. మమ్ముల నట్టికిలమును ముద్దుపెట్టుకొను మందువా! రాచకొలువులోనివారు పునుఁగు, జవ్వాజి, మున్నగుసువాసనవస్తువులు చేతులకుఁ బూసికొని యుందురు.

విదూ—మిక్కిలి గాఢమయినవాఁడవు. నిన్ను శుద్ధమయిన పలలముతోఁ బోల్చినయెడలఁ గీటకయోగ్య మగుచెడుమాంసము వంటివాఁడవు. దూరమాలోచించి గుణవంతులయొద్దనుండి మంచిచెడ్డల నేర్చుకొనుము. పునుఁగుపునుఁ గని మిక్కిలిగా వర్ణించితివి కాని యది నీచేతికిలముకంటె నీచమయినపుట్టువు కలది సుమా! అది కేవలము మార్జాలపురీషము. నీయుదాహరణమును మార్చుకొనుము.

అంగ—నన్ను మించిన రాజయోగ్యము లగు తెలివితేటలు నీయొద్దఁగలవు. నేను మిన్నకుండెదను.

విదూ—నరకమున కేగి మిన్నకుందువా? దేవుఁడు నీకు సహాయుఁ డగును గాక! వెఱ్ఱివాఁడా! దేవుఁడు నిన్ను బాగుచేయునుగాక! నీవేమియుఁ బరిపాకము లేనివాఁడవు.

అంగ—అయ్యా! నేను నిజము కల కూలివాఁడను. నాయాహారము నేనార్జించుకొని తినుచుందును. నాకట్టుబట్టలను నేనే సంపాదించుకొందును. ద్వేషమును నేనెవ్వనికి నచ్చిలేను. నేనెవ్వనిసౌఖ్యమును గాంచి యసూయఁ జెందను. ఇతరులమేలుం గూర్చి సంతసించెదను. నాకుఁ గస్తికలిగిన

నోర్చుకొనియెదను. నాగొఱ్ఱెలు తృప్తిగా మేయుటయు, గొఱ్ఱెపిల్లలు పాలుగ్రోలుటయుఁ జూచుటయే నాకు మిక్కుటమైన గర్వకారణము.

విదూ—ఇదియు నీ ప్రకృతియొక్క యజ్ఞానదోషము. దీనినుండి నీవెట్లు తప్పించుకొందువో గదా!

అంగ—మా క్రొత్తయజమానురాలిసోదరుఁడును, నాయజమానుఁడు నగువసంతుఁ డిటులే వచ్చుచున్నాఁడు.

(చారుమతి చేత నొకకాగితముం బట్టుకొని చదువుచుఁ బ్రవేశించును.)

చారు—చం. మఱవక సేతుశీతగిరిమధ్యమహీతలమెల్లఁ గాంచినన్
దొరకునె యట్టి చారుమతితోఁ దులఁదూఁగినభూషణంబు, సుం
దరి యగు నామెరూపము ఘనం బగువాయుతురంగ మెక్కి త్రి
మ్మరె భువనంబులెల్ల, నతిమాత్రపుఁజాతురితో లిఖించు చి
త్తరువులు గూడ నామెదరిదాపున నిల్చిన నల్లబొగ్గులౌ,
హరిహరి! నాదు నెమ్మనమునందుఁ దదీయమనోహరాంగమై
ఖరులనె కాక నేఁటొకటి గ్రాలఁగనీయను నీకు మ్రొక్కెదన్. 44

విదూ—అల్పాహారమ్ము, భోజనము, నిద్ర యీవేళలం దక్కఁ దక్కినవేళల నిట్టిగీతము లెనిమిదేండ్లయిన నెడతెఱపి లేక చెప్పఁగలను. ఈచంపకగీతమాలిక నిశ్చయముగా రాజవీథి నొకతె వెంట నొకతె మెల్లఁగాఁ బోవు చల్లలమ్ము గొల్లపడుచులచాలువోలె నున్నది.

చారు—బుద్ధిహీనుఁడా! పొమ్ము పొమ్ము.

విదూ—నాకవిత్వముఁ గూడఁ జవిచూపెదను.

చం. హరిణము లేడికై వెదకనప్పుడు చారుమతిం గనుంగొనం
దొరకెను, గంతుఁబిల్లి తనతో యయ్యాలి వెంటఁబడంగ వాఁడునుం
దరికి ననుంగుఁ జాపము ఘనం బగునుండుఁ, గృశాంగియైన నా



తరుణికి శీతకాలపరిధార్యములం జమిలించినట్టులే
ర్పఱిచిన బల్పుఁజెందు, నొనరన్ వరిఁ గోసియు నూర్చి ధాన్యమం
దఱు నెగురంగఁబోసి త్వరితంబుగ బండి సమర్చి దానవి
త్తరిఁ గొనిపోవలెం, గఠినతం దగుటెంకలలోపలన్ మనో
హర మగుతియ్యపప్పు వలె హా! యనిపించును నాలతాంగి, య
బ్బుర మగుకేతకీకుసుమముం గొనుచుండఁగఁ గంటకంబులే
తఱిఁ బొడువంగసాగిన విధంబునఁ జారుమతింగొనన్ భయం
కర మగుతీవ్రమోహ మనుకంటకముల్ మదినేర్చు నక్కటా! 45

ఇదియే గీతముల వక్రధావితము. ఇట్టివానితో నిన్నేల పాడుచేసికొందువు?

చారు—ఓరీ! యవివేకపుముద్దా! ఊరకుండుము. ఈమాలిక నొకవృక్షస్కంధమునఁ గాంచితిని.

విదూ—నిశ్చయముగా నాచెట్టు చెడుకాయలు కాచుచున్నది.

చారు—నిన్నాచెట్టున కంటఁగట్టిన యెడల గ్రచ్చచెట్టున కంటఁగట్టినట్లగును. అప్పు డది ప్రప్రథమముననే దేశమునఁ బండ్ల రాల్చునది యగును. మఱియు నీవు పండ్లుపండకమున్నె యెండి క్రుళ్లిపోయెదవు. అకారణముగఁ బరులహింసించు దుస్తరుల కిది యుక్తమైన ఫలితమేగదా?

విదూ—బాగుగాఁ జెప్పితివి. ఈవాక్యములయందలి రసమో నీరసమో యరణ్యవృక్షములే పరిశీలించునుగాక!

(కమల యొక వ్రాసినకాగితముం బట్టుకొని చదువుచుఁ బ్రవేశించును.)

చారు—(విదూషకునితో) సద్దు సేయకుము. నాసోదరి యగుకమల యేదియో చదువుచు నిటులే వచ్చుచున్నది. కొంచె మోసిల్లుము.

కమ. గీతమాలిక. విపిన మిది యేలకావలె! విజనమాట
వలననా? కాదు; ప్రతిపాదపంబునకును
నాలుకలు వ్రేలఁగట్టెద; లీల నవియు
నాగరకతకు ననువగు నవ్యనీతు
లను బ్రబోధించుచుండు; నెట్లనఁగ ధరణి. 1

గీ. ప్రజల జీవిత మొకయాత్రవంటి దరయ;
జననమాదిగ మరణంబుదనుక మనుజుఁ
డెంతసడచిన నొకజేనెఁడంతకన్న
మించఁ డాప్తులతో నొనరించునట్టి
మితికి మీఱినశపథముల్ మించుచుండు. 2

గీ. అవనిరుహశాఖలందు వాక్యాంతములను
నబ్జముఖిపేరు లిఖియింతు; నందువలన,
జగతి జీవులయోగ్యతాసారమందు
నిగ్గుఁజేకూర్చి సకలనిర్ణేత యయిన
భువనపతి చారుమతిరూపమున నిమిడ్చె
ననుచుఁ జదివెడు ప్రతిమానవునకుఁ దోఁచు. 3

గీ. వితతలావణ్యవినయవివేకముఖ్య
సకలసద్గుణవితతిఁ బ్రజ్వరిలఁజేయ
వలయు నొకవ్యక్తి ననుచు స్వభావమునకు
నానఁ జేయంగఁబోలు సర్వాధిపుండు; 4

గీ. తారనుం బోలుఁగాని సౌందర్యమందు
వర్తనంబునఁ బోల దాకీర్తితాంగి;
యహహా! ఘనతరకార్యనిర్వహణమందుఁ
బోలు సాత్రాజితిని; విక్రమాలవాల; 5



గీ. స్మరసతినిఁ బోలు సర్వాంగసౌష్ఠవమున;
సాధ్వి యనఁజెల్లు జానకీసతినిఁ బోలి;
వసుమతి ననేకకాంతల వదనములును,
నేత్రములు, మానసములు, నీనెలఁతయందుఁ
బ్రస్ఫుటంబుగ నిమిడింపఁబడె; నిదెల్ల
నలినభవుఁ డీమెయం దెడ్డు నిలుపుఁగాక!
యిలను మెయివడుదాఁక నన్నీలతాంగి
దాసునిగఁ జేయుఁగాక పద్మాసనుండు. 46

చారు—ఓ యోగ్యుఁడవయిన యుపదేశికుఁడా! దీర్ఘమయిన మోహతంత్రో పన్యాసముచే నీయంతేవాసుల నెంత విసికించితివి? కాని నడుమ నొక్క సారి యయినను సచ్ఛాత్రులారా! సద్విషయముం బోధించుచుంటిని గావున నించుక సహించి వినుఁడు. అని మా విసుగుదల నపనయింపక పోయితివి.

కమ—(గోపకుని విదూషకునిఁ జూచి) ఓహో మీరుఁ గూడ నిచట నుంటిరా! స్నేహితులారా! కొంచె మోరసిల్లుఁడు. గొల్లవాఁడా! ఆవలికిఁ జనుము. బాలిశా! నీవును గొల్లవానితోఁ బొమ్ము.

విదూ—గొల్లవాఁడా! రా రమ్ము. మనము కొంచెము మర్యాదతోనే పోవుట మంచిది. కంచము, ముంత, పట్టుకొని కాకపోయినను, కొంకి, గొంగలి బుజమున వేసికొని పోవుదము రమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు.)

కమ—ఈగీతములను వింటివా?

చారు—ఆహా! వాని నన్నింటిని వింటిని. వానినే గాదు. ఇంకను నెక్కువ వింటిని. ఏలయన గీతముల మొయునంతటికంటె నెక్కుడు చరణములు గూడఁ గొన్నిటికిఁ గలవు.

కమ—అది యొక్క లెక్కలోనిది గాదు. చరణము లెక్కవయిన గీతముల మోయఁజాలకపోవు గదా!

చారు—అట్లే యగునుగాని పాపము లెగుడుదిగుడు గలవి యగుటచేఁ బద్యము నాధారముచేసికొనకుండ స్వతంత్రముగా నిలువఁజావు. అందు హ్రస్వములగు పాదము లప్రయోజనములై పద్యమునంటుకొని వ్రేలాడుచుండును.

కమ—కాని, చెట్లయందు నీపేరు చెక్కఁబడుటయుఁ, బత్రికలయందు వ్రాయఁబడి వ్రేలాడుచుండుటయు నీ కాశ్చర్యము గలిగింపలేదా!

చారు—నేను బొందవలసిన యాశ్చర్యముయొక్క పరమావధికాలమందు ముప్పాతికమువ్వీసము నీవు వచ్చునప్పటికే గడచిపోయినది. ఏలయన, నే నొకఖర్జూరవృక్షమునఁ గాంచిన దీనిం జూడుము. వేదవ్యాసునికాలమున నేను మూషకము నైనట్లు జ్ఞాపకము. నాఁటనుండి నేఁటివఱకు నే నెత్తినజన్మాంతరములయం దెన్నఁడును గీతములచే నిట్లు కీర్తింపఁబడలేదు.

కమ—దీనికిం గారణ మెవ్వరో నీకుఁ దెలియునా?

చారు—మనుష్యుఁడే యైయుండునా?

కమ—నాఁడు నీ వెవ్వనికంఠమున ముక్తాహారమును వైచితివో యాతఁడే.

చారు—(నివ్వెఱపడి చూచుచుండును)

కమ—ఈవైవర్ణ్య మేమి?

చారు—నీపుణ్యమాయె నెవ్వరో చెప్పుము.

కమ—అయ్యో దైవమా! మిత్రసమావేశము కడుదుర్లభము. అయినను భూకంపమువలన దూరస్థము లైనయచలములు గూడ సమీపించును గదా!

చారు—దానికేమి గాని యాతఁ డెవ్వఁడై యుండును!

కమ—ఇది యేమి చోద్యము!

చారు—రాజసన్నిధిని విన్నవించుకొన్నట్లు నిన్ను మిక్కిలి ప్రార్థించెద నిఁకనైనం జెప్పుము.



కమ—అద్భుతము! అత్యద్భుతము!! మహాద్భుతము!!! చెప్ప నలవిగాని యద్భుతము!!!!

చారు—నాసౌందర్యముతోడు. బాహ్యమున ధరించినపురుషాకృతి యంతరంగమునఁ గూడ నుండు ననుకొంటివా! నీ వింకొకనిమిష మాఁగినచోఁ బ్రశ్నాంబుధిని మునుంగుదువు. నిన్ను బతిమాలుకొనుచుంటి నాతఁ డెవ్వఁడో యాలసింపక శీఘ్రముగాఁ జెప్పుము. దైవము నిన్ను నత్తిదానినిగానైనను జేసిన బాగుండును. అట్లైన గిండ్లనుండి ద్రాక్షారసంబు భంగి నొకనిమిషమాఁగి యింకొకనిమిషమున కైనను నీనోటినుండి నీవు దాఁచియుంచిన పురుషుని నామ మువ్వెత్తుగ నొక్కసారి వెలువడును గదా! దయచేసి నీనోటినుండి బిరడాను వదలింపుము. అట్లయిన నీవార్తావృత్తముం గ్రోలెదను. భగవంతునిచే సృజింపఁబడిన వాఁడేనా? వాఁ డెట్టివాఁడు? చుబుకంబు కూర్చాగ్ర మైనదేనా?

కమ—వాని గడ్డము కడుఁజిన్నది.

చారు—అయిననేమి! అతఁడు కృతజ్ఞుఁడై యుండిన యెడల దైవమనల్పముగా ననుగ్రహింపఁగలఁడు. ఎవనిగడ్డముం గూర్చి నీ విందనుక ముచ్చటించుచుంటివో వానిజ్ఞానమును నాకుఁ గలిగించిన వానిగడ్డ మెదుగునంతవఱకు నిరీక్షించి యుండును.

కమ—మల్లుని నీహృదయమును నేకకాలమున నే తన్నుకొనిపోయిన యువకుఁడగునాభీమబలుఁడు.

చారు—ఈపరిహాసముల కేమి లెమ్ము. ఇవి పిశాచకృత్యములు. ఇఁకనైన గరితవై సత్యము వచింపుము.

కమ—అక్కా! నీతోడు. అతఁడే!

చారు—భీమబలుఁడే?

కమ—భీమబలుఁడే!

చారు—అయ్యో! ఎంతటిదుర్దినము! ఈపురుషాకృతి నేమిసేయుదును? నీవాతనిం జూచినప్పు డేమిచేయుచుండెను? ఆతఁ డేమిచెప్పెను? ఎట్లు గాఁ గాన్పించెను? ఎచ్చటి కేగెను? ఇచ్చట నేమిచేయుచుండెను? నన్నుఁగూర్చి ముచ్చటించెనా? నివాసమెచ్చట? నిన్ను విడిచి యెట్లు పోయెను? నీవు తిరిగి వాని నెప్పుడు చూచెదవు? ఈప్రశ్నల కెల్ల నొక్కమాటతోఁ బ్రత్యుత్తర మిమ్ము.

కమ—అఘాసురుని వక్త్రమును నాకొకసారి యెరవుదెచ్చి యిమ్ము. ఇప్పటి పరిమాణము గలయేనోటియందైనఁ బట్టఁజాలదు. ఈప్రశ్నముల కొఁగాములు చెప్పుట సంగ్రహగ్రంథమును వివరించుటకంటె దుర్ఘటము.

చారు—నే నీయరణ్యమునఁ బురుషవేషముతో నుంటి నని యాతఁ డెఱుంగునా! మల్లయుద్ధమునాఁటి బలిష్ఠతతో నుండెనా?

కమ—కాముకులప్రశ్నలకు సదుత్తరంబు లిచ్చుట పరమాణువులఁ బరిగణించుటవంటిది. నే నాతనిం గాంచిన వైఖరిని వివరించెదను. శ్రద్ధతోఁ జవిచూచి రసానుభవముం గాంచుము. నేనాతని నొక్కరసాలచ్ఛాయను బరిపాకపతిత మైననూత్నఫలముంబోలెఁ గాంచితిని.

చారు—ఇట్టిమహాఫలంబు నిచ్చునది సురసాల మనవలయును.

కమ—అక్కా! చారుమతి! నామాటలకు నడుమ నడ్డుదగులక సమగ్రముగా వినుము.

చారు—నివేదింపుము.

కమ—ఆతఁడు శరవిద్ధుఁడైన యుద్ధశూరునివలె శయనించి యుండెను.

చారు—ఆస్థితిఁ జూచుటకు విచారకరమైనది, యైన నాభూమి కలంకారము.

కమ—నీరసనాశ్వంబునకు బందము వేయుము. సమయాసమయ వివేకమును విడిచి యిచ్చవచ్చినట్లు దుముకుచున్నది. ఆతఁ డొకయాఖేటకుని చందంబున నున్నవాఁడు.



చారు—అయ్యో! గ్రహచారమా! వాఁడు నామనోమృగమును వేఁటాడ వచ్చుచున్నాఁడు.

కమ—అడ్డుదగులక నాపాట నన్నుఁ బాడనిమ్ము. మాటిమాటికి శ్రుతిఁ బాడు సేయుదువు.

చారు—నే నాఁడుదాన ననుమాట నీవెఱుంగుదువా? యెఱుంగవా? నేను యోజించినది యెల్ల వెలివఱుచుచుండవలెను. ప్రియురాలా! చెప్పుము.

కమ—నీహృద్గతాంశముల నెల్ల బయటికి లాగుచుంటివి. సద్దుచేయకుము. ఆతఁడిచ్చటకు వచ్చుట లేదా?

(భీమబలుఁడు, ప్రియంవదుఁడు ప్రవేశించుచున్నారు.)

చారు—మన మీప్రక్క నొదిఁగియుండి యాతనిచర్యలం జూతము.

ప్రియం—నాకు సహచరుఁడ వైయుండి నందుకు నీకు మిక్కిలి కృతజ్ఞుఁడను. నే నసహాయుఁడనై యున్నను నిశ్చయముగా నింతయానందమును బొందువాఁడనే.

భీమ—నేను నట్లే యుండి యుందును. అయినను నాచారనిర్వహణంబునకై నేనును నీయనుసరణంబునకై కృతజ్ఞతావచనముం బలికెదను.

ప్రియం—భగవానుఁడు నీకు సహాయుఁ డగునుగాక! మన మింతటినుండి సాధ్యమయినంత తక్కువగాఁ గలసికొందము.

భీమ—అట్లుగాదు. మన మెన్నఁడును బరిచితులము గానియట్లే యుండవలెను.

ప్రియం—ఇంతకెన్నఁడును, పట్టలపై మోహగీతంబులు చెక్కి వృక్షములఁ బాడుచేయవల దని నిన్నుఁ బ్రార్థించుచున్నాను.

భీమ—ఇఁక నెన్నఁడు నాచక్కని గీతములను నీయపస్వరములతోఁ బాడి పాడుచేయ వలదని నిన్ను మిక్కిలి వేఁడుకొనుచున్నాను.

ప్రియం—నీప్రియురాలిపేరు చారుమతియా?

భీమ—అగును. సరిగాఁ జెప్పితివి.

ప్రియం—ఆపేరు నాకంత హితముగా లేదు.

భీమ—పాప మామెకుఁ దల్లిదండ్రులు నామకరణముసేయునపుడు నీతోఁ జెప్పకపోయిరి.

ప్రియం—ఆపె యెంతటి పొడవరి ?

భీమ—నాహృదయమంత యెత్తుగా నుండును.

ప్రియం—నీ కెప్పుడును మంచిసమాధానములు సిద్ధముగా నుండును. నీకగసాలపడుచులతోఁ బరిచయము లేదు కానోపు. వారియంగుళీయకములపై నున్నముద్రణముం బట్టి వారిం దెలిసికొనవలయును.

భీమ—అట్లుగాదు. సామాన్యకుటుంబినులు చిత్రపటంబులపైఁ దమభావార్థములఁ జిత్రింపించి గోడలపై నలంకరింతురు. వానింగాంచి నీవిట్లు పలుకుచుంటివి.

ప్రియం—నీవు క్షిప్రమైన చాకచక్యము గలవాఁడవు. ఈవేగము పవనసూనుని పాదములనుండి యలవడి నట్లున్నది. నీవు నాతోఁగూడఁ గూర్చుండెదవా? మనయుభయులకుం బ్రియురాలగు ప్రకృతికాంతను. దానివలనఁ గల్పింపఁబడిన దౌర్భాగ్యమును దిట్టిపోయుదము.

భీమ—నన్నే దక్క ప్రపంచమున నూపిరివుచ్చు నేప్రాణినైనను నిందింపను. నాయందే లెక్కలేని లోపములు గలిగియున్న వని నేనెఱుంగుదును.

ప్రియం—నీయందలి లోపము లన్నిటియందును ముఖ్యమయినది ప్రేమించుటయే.

భీమ—ఇది నీయందుఁ గలఘనమైన సద్గుణముతో నైనను వినిమయింప నిచ్చగింపని గొప్పతప్పు. నిన్నుఁ జూడ నాకుఁ గడు విసువుదలగా నున్నది.

ప్రియం—నాసత్యముతోడుగా నే నొకవిదూషకునికై ప్రయత్నించుచుండఁగా నీవు లభించితివి.



భీమ—వాఁడాతటాకమునఁ బడిమునిఁగిపోయెను. కొంచెము నీళ్లలోనికి వంగి చూడుము. నీకే కాన్పింపఁగలఁడు.

ప్రియం—(నీళ్లలో తొంగి చూచి) అచట నాప్రతిచ్ఛాయయే కాన్పించుచున్నది.

భీమ—దాని నే నొక విదూషకునిగా నైనను, సున్నగా నైనను భావించెదను

ప్రియం—ఇంక నే నీచెంగట నుండను. ఓమోహావతారమా ! నీకు శుభమగుఁగాక !

భీమ—నీవు వెడలిపోవుటకుఁ జాలసంతోషముగా నున్నది. ఓవిచారావతారమా నమస్కారము.

(ప్రియంవదుఁడు నిష్క్రమించును.)

చారు—(అపవారించి కమలతో) పెంకెతనంబుఁ జూపు కితవభృత్యునింబోలి నటించి యీతనితో ముచ్చటించెదను. ఈవేషముతోడనే వీని నొకవెంగలినిఁజేసి యాడించెదను (భీమబలు నుద్దేశించి) ఓయాటవికుఁడా ! వినఁబడుట లేదా ?

భీమ—బాగుగనే వినఁబడుచున్నది. నీ కేమి కావలయును ?

చారు—ఇప్పు డెన్నిగంటలైనదో చెప్పఁగలవా ?

భీమ—దినంబున నెంతకాలము గతించిన దని ప్రశ్నించిన బాగుగానుండును. ఈఘోరారణ్యంబున గంటలు చెప్పుటకు గడియారము లెచ్చటనున్నవి.

చారు—అట్లయిన నీయరణ్యమునఁ గాముకుఁ డెవ్వఁడును లేఁడు. ఉన్నయెడల ననుక్షణంబును వెలువరించు నిట్టూర్పులతోడను వేదనాధ్వనులతోడను సోమరియైన కాలగతికంటె స్వతంత్రముగాఁ గాలనిర్ణయముఁ జేయుచుండును.

భీమ—ఆకాలగతిని దీవ్రమయిన దని యేలచెప్పరాదు? ఇదియును దీని కనురూపమే కదా !

చారు—అయ్యా! అట్లనుట కవకాశమే లేదు. అది భిన్నభిన్నస్వభావులతో భిన్నభిన్నగతులఁ బ్రవర్తించుచుండును. ఈకాలాశ్వ మెవ్వనితో ధౌరితగతి నవలంబించునో, వేనితో వల్గితగమనంబు సల్పునో, ఎవనితోఁ బ్లుతనటనం బొనర్చునో, వేనితో స్తంభీభావము నొందునో నీకుఁ జెప్పఁగలను.

భీమ—వేనితో వల్గితంబు సలుపునో దయచేసి చెప్పుఁడు.

చారు—దైవసాక్షిగాఁ జెప్పుచుంటిని. నిరూఢయౌవనయైన కన్యకు సంబంధనిర్ణయము మొదలు వైవాహికముహూర్తమువఱకు నడుమఁ గలవ్యవధానమందుఁ గాలాశ్వ మామెతోఁ గఠినమైన వల్గితగమన మాచరించును. ఏలయన, నీవ్యవధానమునఁ గాలాశ్వగతిసప్తాహంబు లైనచో సప్తవత్సరంబులంతటికఠినముగాఁ దోఁపఁగలదు.

భీమ—ఎవనితో ధౌరితక మాచరించును!

చారు—గీర్వాణభాషాజ్ఞానము లేనిమతగురునితోడను, వాతరోగములేని ధనవంతునితోడను, ధౌరితకమును గలిగి యుండును. మొదటివాఁడు విద్యావిహీనుం డగుటచే గ్రంథవ్యాసంగమున కనువుపడక సుఖముగా నిద్రించుచుండును. రెండవవాఁడు శారీరవ్యథావిరహితుఁడై స్వేచ్ఛగాఁ బ్రవర్తించును. ఒకనికి శరీరమును గృశింపఁజేయు విద్యాభారములేదు. ఇంకొకనికి దినదినాభివృద్ధిఁ జెందు దారిద్ర్యభారములేదు.

భీమ—వేనితోఁ గాలాశ్వము ప్లుతగతుల నెరపును?

చారు—వధ్యస్థానమునకుఁ గొని పోఁబడు నరహత్యాపాతకునితో—ఏలయన, వాఁడు గమ్యస్థానమునకుఁ బోవునపుడు మందగతుల నెంతకాలయాపన మొనర్చినను నిమిషమాత్రముగాఁ బరిగణించును.

భీమ—ఎవనితో స్తంభీభవించును?

చారు—సెలవుదినములయందు న్యాయవాదులతో—వారికాలమునఁ గార్యాలోచనములేక నిద్రించుచుండుటచేఁ గాఁగతిని గుర్తింపఁజాలరు.



భీమ—ఓసుందరుఁడా! నీనివాస మెక్కడ?

చారు—కంచుకము నాశ్రయించు సరిగంచువోలె నున్న యీవనోపకంఠంబున నాసహోదరియైన యీగోపికతోఁ గూడ వసించి యుంటిని.

భీమ—నీ కిది స్వదేశమేనా?

చారు—స్వస్థానంబు విడువని శశకంబులకుఁబోలె.

భీమ—నీవచనరచన యరణ్యమున లభింపఁదగిన దానికంటె మిన్నగా నున్నది.

చారు—ఇట్లే పలువురు పలికిరి. యౌవనదశయందు నాగరకుఁడై వార్ధకంబున యత్యాశ్రమంబు గ్రహించిన నాపితృవ్యునివలన నీమృదుసంభాషణము నాకలవడినది. ఆతఁ డచ్చట నుండుకాలమున స్త్రీపరాయత్తచిత్తుం డగుటచే మోహతంత్రమందు మిగుల నిపుణుఁడు. పిమ్మట నామోహతంత్రంబునకు వ్యతిరేకంబుగ నుపన్యాసంబు లనేకంబులిచ్చుచు స్త్రీలంగూడ దూషించుచుండెడువాఁడు. ఆదూషణంబులకు లోనుగాకుండ నన్ను స్త్రీనిగా సృజింపక పురుషునిగా నిర్మించినందునకు భగవంతునకు మిక్కిలి కృతజ్ఞుఁడనై యున్నాను.

భీమ—ఆతఁడు స్త్రీలయం దారోపించిన ముఖ్యదోషంబు లెవ్వియైనను నీకు జ్ఞప్తియందుఁ గలవా?

చారు—ముఖ్యమైనవి యెవ్వియును లేవు. కాని కాసులవలె నన్నియు సమానములే. రెండవది చెప్పువఱకు దేనిమట్టు కదే యుత్కృష్టమై తోఁచును.

భీమ—అట్లయినఁ గొన్నిలోపములు తిరిగి లెక్కింపుము.

చారు—రోగులపైఁ గాని నాయకాపథ్యముఁ బ్రయోగింపను. ఒకమనుష్యుఁడీయరణ్యమున భూతమువలెఁ జరించుచు పట్టలపైఁ జారుమతి యనుపేరుఁ జెక్కి తరుణతరుజాలంబుఁ బాడుసేయుచుండెను. పూఁబొదరిండ్లపై వర్ణనాగీతంబులను వ్రేలాడఁగట్టి నిశ్చయముగఁ జారుమతీనామమును భగవన్నామమువలెఁ గొలుచుచున్నాఁడు. ఈకాముకుఁడు మదనజ్వర

పీడితుండైనట్లు గాన్పించుచుండెం గావున నే నాతని గలిసికొనఁగలిగితి నేని మంచిసదుపాయము బోధింపఁగలను.

భీమ—ఇట్లు మోహసంచలితుఁ డైనవాఁడను నేనే గావున నీప్రతిక్రియా విధానమును నాకెఱింగింపు మని ప్రార్థించుచున్నాను.

చారు—మాపినతండ్రిచేఁ జెప్పఁబడిన కాముకలక్షణంబులు నీయందుఁ గాన్పించుటలేదే! మోహపరవశుని గనుంగొనువిధానము నా కాతండే నేర్పియుండెను. శరపంజరమువంటి మోహబంధమున బందీకృతుండ వైనట్లు గాన్పించుటలేదే!

భీమ—మీపినతండ్రిచేఁ జెప్పఁబడిన లక్షణంబు లెవ్వి?

చారు— శుష్కించినచెక్కులు; అవినీయందుఁ గానరావు. నీలవర్ణములై గుంటలువారిన కన్నులు; అవియును నీయందుఁ గానరావు. మిత్రులతోడ సంభాషించుటయం దిచ్ఛలేకపోవుట; అదియును నీయందుఁ గాన్పింపదు. ఉపేక్షింపఁబడినగడ్డము; అదియును నీకులేదు. అయినను గనిష్ఠసోదరుని దాయభాగమువలె నున్ననీగడ్డమునుగూర్చి మన్నించెదను. బిగియింపంబడని మేజోడును, ముడివేయఁబడని కుళ్లాయియును, బంధింపఁబడని పాదరక్షలును నీయాకారమెల్ల నుపేక్షాభావమువలన శిథిలమైనటులు గాన్పింప వలెను. కాని నీ వట్లులేవు. ఇట్టి నీవేషవైఖరింబట్టి చూడఁ జారుమతియందు నీవు వెల్లడించు ప్రేమాతిశయముకంటె నీయందలి ప్రేమయే నీకు గాఢమై యున దని నిరూఢముగాఁ దెలియుచున్నది.

భీమ—సుందరుఁడా! నాకుఁ గల ప్రేమాతిశయమును నీవు విశ్వసించునట్లు నీకెఱింగింపలేమికి మిక్కిలి విచారించుచున్నాఁడను.

చారు— నన్నా నీవు నమ్మించునది! నన్నెంతత్వరలో నమ్మింపఁగలుగుదువో నీచారుమతిని గూడ నట్లే నమ్మింపఁగలుగుదువు. ఆమె నిన్నుఁ బ్రేమించి యున్నయెడల నట్టిప్రేమను స్వయముగా వెల్లడించుటకంటె నీప్రేమనంగీ



కరించుటయే సులభముగావున నట్లు చేయునేమో? స్త్రీలు తమయంతరాత్మ ప్రబోధించునంశమునకు భిన్నములుగా నాచరించులోపములలో నిదియొ కటి. దీనికేమిగాని చారుమతిని మిక్కిలిగాఁ గొనియాడుచుఁ దరుగుల్మల తానులయందు గీతముల వ్రేలఁగట్టినది నీవేనా?

భీమ—ఓయువకుఁడా! అట్టిదురదృష్టవంతుండ నేనేయని యాచారుమతి కెంజిగురుఁబోలు కెంగేలుతోడుగా నీకుఁ బ్రమాణముచేసి చెప్పుచున్నాను.

చారు—నీగీతములయందుఁ గాన్పించునంతటి ప్రేమానుబంధము నీడెందంబునఁ గలదా?

భీమ—నాయనురాగగాంభీర్యము వర్ణనాతీతము.

చారు—నిజముగాఁ బ్రేమయనునది యొకయున్మాదము. సహజోన్మాదులకుఁ బోలెఁ బ్రేమానుబద్ధులకును దామసాగారంబుల వేత్రశిక్షయే తగినచికిత్స అయినను లోకమునందెల్లరును రాగోన్మత్తులై యుండుటవలన వీరికట్టిశిక్ష విధింప వలనుపడదయ్యె. ఏదియెట్లున్నను నట్టిశిక్షావిధానము లేకయే సులభసాధ్యం బగుసదుపాయంబున నీరుగ్ణత నివారించెద.

భీమ—నీవిదివఱ కెవ్వరికైన నట్టిప్రతిక్రియ నెఱవేర్చియుంటివా?

చారు—ఒక్కని కీవిధమున నెఱవేర్చియుంటిని. నన్నుఁ దనప్రేయసిగ భావించి నన్నాతఁ డనుదినము నుపసర్పించునటులు చేసితిని. దినదినంబును వృద్ధిక్షయంబుల మార్పుఁజెందు చంద్రునిఁబోలె ననుక్షణంబును భిన్నభిన్న ములైన వృత్తిపరంపరలు గలవాఁడనగుటచే, నొకప్పుడు దుఃఖము నొక ప్పుడు స్త్రీస్వభావము నొకప్పు డుత్కంఠయు నొకప్పుడు ప్రీతియు నొక ప్పుడు గర్వము నొకప్పుడు చోద్యము నొకప్పుడు కపిస్వభావము నొక ప్పుడు జేలతనంబు నొకప్పుడు చాంచల్యంబు నొకప్పు డశ్రుధారాపూర ణంబు నొకప్పుడు చిఱునవ్వును, గనఁబఱచితిని. ప్రతిరసంబున నించిం చుక సూచించితినిగాని పూర్ణముగాఁ బ్రకటింపనైతిని. ఇదియేగదా

స్త్రీలకును బాలురకును సహజస్వభావము. ఒకప్పు డనురాగంబు నొకప్పుడు హేయతయు, నొకప్పు డాదరించుటయు, నొకప్పుడు బెదరించుటయు, నొకప్పుడు వానికొఱ కేడ్చుటయు, నొకప్పు డుమియుటయు నిట్టి కృత్యములచే సన్నాశించియున్నవానికి మదనోన్మాదము నెడలించి సహజోన్మాదమును గలిగించితిని. అనఁగాఁ బ్రాపంచికజ్ఞానమును విడిపించి యరణ్యమునఁ దపంబుఁ జేయు మునీశ్వరునిగా మార్చితిని. ఈవిధంబున వానికిం గుదిర్చితిని. అటులే నీకాలేయంబునం గలరాగకళంకమును నిశ్శేషంబుగాఁ జేసి యాటవికహృదయంబుం బోలె శుభ్రపఱిచెదను.

భీమ — యువకుఁడా! ఈరోగనివారణమే నాకిష్టములేనిపని.

చారు — నీవు నాకుటీరంబున కేగుదెంచి నన్నుఁ జారుమతీ! యనిపిలుచుచు నన్ననుసరించిన నీకివ్యాధి నివర్తింపఁ జేసెదను.

భీమ — నాప్రియురాలియందలి విశ్వాసమున నట్లేచేసెదను. నీకుటీర మెక్కడ?

చారు — నావెనువెంట రమ్ము కనఁబఱిచెదను. మనము పోవుదారిని నీనివాస స్థలముగూడ వివరింతువు గాక! వచ్చెదవా?

భీమ — ఓయోగ్యుఁడా! మనస్ఫూర్తిగా వచ్చెదను.

చారు — ఆఁ! ఆఁ! చారుమతీ యనిపిలువుము. కమలా! పోవుదము రమ్ము.

(అందఱు నిష్క్రమింతురు)

## 3-వ రంగము.

### అరణ్యము.

(విదూషకుఁడు మాద్రి ప్రవేశించుచున్నారు,
ప్రియంవదుఁడు రహస్యముగాఁ బ్రవేశించుచున్నాఁడు.)

విదూ — మాద్రీ! రమ్ము. వెనుకడుగు వేసెదవేమి? మాద్రీ! నీగోష్ఠులను నేను దోలుకొనివచ్చెదను. మాద్రీ! ఎట్లు? నీకుం బ్రేమాస్పదుఁడ నింకను నేనేనా? నాముఖమువైఖరి నీకు నచ్చినదా?



మాద్రి — తెనాలిపురవాసులలో రామలింగఁడున్నట్లు నాగోష్ఠులయొద్దను నాయొద్దను వికటకవివై యుంటివి.

ప్రియం — అయ్యో! అపవిత్రస్థానమున నివసించిన యొజ్ఞానమా! తాటియాకులగుడిసెలో నున్నదయ్యముకంటె నీయవస్థ కడునీచముగా నున్నదిగదా!

విదూ — చింతకాయపచ్చడి మెతుకులు పెట్టి పూఁటకూళ్లమ్మ పదిరూపాయలు తెమ్మన్నప్పు డాతని కెట్లుండునో, యొకనిపద్యముల స్వారస్యమును వినువారు గుర్తింపనప్పుడును, నొకనిమాటయందలి రసమును బాగుపడఁదలఁచుకొనిన బుద్ధిమంతుఁడు గ్రహింపలేనప్పు డట్లే చచ్చిన బాగుగానుండును. నిశ్చయముగాఁ గవిత్వరసగ్రహణశక్తి నీకొసంగవలయు నని దేవతలఁ బ్రార్థించుచున్నాఁడను.

మాద్రి — కవితాశక్తి యని చెప్పుచుంటివి. ఆశక్తి యేస్వరూపముగలదియో నాకుఁ దెలియకున్నది. అది మాటనిలుకడ గలదియు పనిదబ్బఱలేనిదియు నైనదేనా? నిర్మలమైనదేనా?

విదూ — నిశ్చయముగా నట్లుగాదు. ఏలయన నిజమైన పద్యకావ్యము స్వకపోలకల్పిత మగుటచేఁ గేవల మసత్యము. కాముకులు, కవీశ్వరులై పరిణమించి తమపద్యములయందుఁ జేయుప్రమాణములను గాముకవృత్తియందు నటింతురు.

మాద్రి — అట్టులైన నన్నుఁగూడ దేవతలు కవినిగాఁ జేయవలయు నని కోరుచుంటివా?

విదూ — నిశ్చయముగా నట్లే కోరుచుంటిని. ఏలయన, నీవు సత్యవంతురాల నని నాతోఁ బ్రమాణముచేసితివి. ఇపుడు నీవు కవివైనచోఁ గొంత నటనాశక్తి గలదాన వగుదు వనునాశ కలుగును.

మాద్రి — నేను మర్యాదకలదానను గా నుండవలయు నని నీకులేదా?

విదూ — నీవు కురూపిణివైనఁ దప్పు నిశ్చయముగా నటులులేదు. ఏలయన

మర్యాదతో సౌందర్యమును జతపఱిచినఁ జక్కెరలోఁ దేనెఁ గలిపినట్లగును.

ప్రియం — (తనలో) వీఁడు కొంచెము తెలివిగల నిర్భాగ్యుఁడే.

మాద్రి — నేనంత యందకత్తెను గాను. కావున దేవతలు నాకు సుగుణసంపత్తినే దయసేయుదురుగాక !

విదూ — నిజముగా మాణిక్యమువంటి మర్యాద నీయెబ్రాసితొత్తుపైఁ బడవైచిన ముఱికిచిప్పలోనుంచిన మంచియామిషంబువలె శోభించును.

మాద్రి — నేనెబ్రాసినైనందుకు దేవతలకు గృతజ్ఞనై యుండవలసియున్నను దొత్తునుమాత్రము కాను.

విదూ — బాగుగనే యున్నది. నీయెబ్రాసితనమునకు దేవతలు స్తుతింపఁబడుదురుగాక ! తొత్తుతన మింకముందు వచ్చుఁగాక ! అదెట్లయిన నుండనిమ్ము. నిన్నుఁ బెండ్లిచేసికొందును. ఇందునకే బొరుగూరిపురోహితుఁడగుకొండుభట్టుగారియొద్దకుఁ బోయియుంటిని. ఈయరణ్యప్రదేశమునకే తాను వచ్చి మననాలుగుచేతుల నేకముచేసెద నని వాగ్దానము చేసియున్నాఁడు.

ప్రియం — (తనలో) ఈసమావేశము గాంచుటకు నేనుత్సాహపడుచుంటిని.

మాద్రి — దేవతలు మనకు సంతోషమొసంగుదురుగాక !

విదూ — తథాస్తు. ఎవఁడైనఁ బిఱికివాఁడైనయెడల నీప్రయత్నమున నడలిపాఱిపోవును గదా ! ఏలయన, వృక్షములేకాని యాలయము లేదు. కొమ్ములు దిరిగినమృగసంఘమే గాని బంధుసంఘములేదు. అయిన నేను, ధైర్యమవలంబింపవలయును. కొండుభట్టుగారిటులే వచ్చుచున్నారు.

(కొండుభట్టు ప్రవేశించును)

విదూ — అయ్యా ! కొండుభట్టుగారూ ! మీరు సమయమునకు దయచేసితిరి. మీరు మాకార్యము నీచెట్టుక్రింద నెరవేర్చెదరా ! లేక మీతోఁగూడ దేవాలయమునకు రమ్మందురా!



కొండు — ఇచ్చటను గన్యాదాత లెవ్వరునులేరా ?

విదూ — ఎవ్వరయిన దానమిచ్చినయెడల నేను దీనిని బుచ్చుకొనను.

కొండు — నిశ్చయముగా నామె నెవ్వరయిన నీయవలసినదియే లేనియెడల వివాహము శాస్త్రోక్తము కానేరదు.

ప్రియం — (ముందుకువచ్చి) కానిండు కానిండు. ఆమెను నేనిచ్చెదను.

విదూ — దండములండీ! అయ్యా! మీపేరేమి? తమకు క్షేమమా? మీరు మమ్ములను మిక్కిలి మంచిసమయమునఁ గలిసికొంటిరి. మనప్రథమసమాగమమునకు దైవము లాభము గలుగఁజేయునుగాక! మిమ్ములఁ జూచినందుకు నాకుఁ జాలసంతోషముగా నున్నది. అయ్యా! ఇచ్చట నొకస్వల్పకార్యము జరుగుచున్నది. దయచేసి కుల్లాయిఁ బెట్టుకొనుఁడు.

ప్రియం — విదూషకుఁడా! నీవు పెండ్లిచేసికొందువా?

విదూ — అయ్యా! ఎద్దునకుఁ గాఁడివలెను, గుఱ్ఱమునకుఁ గళ్లెమువలెను, డేగకు మువ్వవలెను, మనుష్యునకుఁ గోరికలు కలవు. పావురములు ముక్కుముక్కుఁ జేర్చుకొనునట్లు వివాహము —

ప్రియం — నీవింత విద్యాబుద్ధులు గలవాఁడ వయ్యు ముష్టివానివలె నీచెట్టుక్రిందనా పెండ్లి చేసికొనుట! నీవెద్దియేని దేవాలయమున కేగి వివాహసమయములఁ దెలుపఁజాలు పురోహితునిం జూచుకొమ్ము. ఈకొండుభట్టు కొట్టుబల్లలను గూర్చునట్లు మిమ్ములం గూర్చును. తరువాత మీలో నొకరు బింకముతప్పి తుదకుఁ బచ్చిబల్లలచేఁ జేయఁబడిన కొయ్యతలుపు లెండి యోరసిల్లునట్లు పెడమొగములు పెట్టుకొని యెడఁబాటుఁ జెందెదరు.

విదూ — (ప్రియంవదు నపవారించి) నాకేమియు నిష్టములేదు గాని, అయినను వీనిచేతనే యీకార్యము నెఱవేర్చుకొనుట నాకుమంచిది. ఈతఁడు జరుపవలసిన తంతు యథావిధిగా జరుపనేరఁడు. అందువలన నవసరమువచ్చినపుడు దీనిదిగనాడి పోవుట కవకాశముగా నుండును.

ప్రియం—నీవు నాతో వచ్చి నన్ను నీకుఁ దగిన సదుపాయముఁ జెప్పనిమ్ము.

విదూ—ఓప్రియురాలా! పోవుదమురమ్ము. కొండుభట్టుగారూ! మీకు నమస్కారము. సెలవొసంగుఁడు.

గీ. ఉండబెల్లంబువంటి యోకొండుభట్ట!
మొండిధైర్యంబుగల్గు నోకొండుభట్ట!
పోకుపోకుము ననువీడి ముందునీవు
కాచు కాదిప్పు బట్టలు కట్టఁగట్టి
చంకఁబెట్టుకపొమ్ము నేనింక నీకు
సెలవొసంగితి పొమ్ము నీచేత నేను
బెండిలి యొనర్చుకొననోయి కొండుభట్ట! 47

(విదూషకుఁడు, మాద్రి, ప్రియంవదుఁడు నిష్క్రమింతురు.)

కొండు—అయిన నేమి లెమ్ము. చపలచిత్తులైన యీదుర్మార్గులందఱు నేకీభవించి నను నాయుద్యోగమును దీసివేయఁజాలరు.

(నిష్క్రమించును.)

## 4-వ రంగము.

### అరణ్యము.

(చారుమతీకమలలు ప్రవేశించుచున్నారు.)

చారు—నాతో నెన్నఁడును మాటలాడకుము. నాకు దుఃఖము కలుగును.

కమ—కంటఁ దడిపెట్టుటపొరపాటము కాదని జ్ఞప్తికిం దెచ్చుకొనుమని వేఁడుకొనుచుంటిని.

చారు—నాదుఃఖమునకుఁ దగినకారణము లేదా ?

కమల—ఒకఁ డెంతమంచికారణము గావలయు నని కోరునో యంతయుఁ గలదు. దుఃఖపడుము.



చారు—వానిశిరోజముల వర్ణమే వానివిశ్వాసహీనతను దెలియఁజేయుచున్నది.

కమ—వీనిశిరోజములు యూదాయనువానిశిరోజములకంటె నించుక ధూమ్రవర్ణముంగల్గియున్నవి. దైవమా దాని ముద్దులూయూదాపిల్లలే.

చారు—నిశ్చయముగా వానిశిరోజములు మంచివర్ణము కలవి.

కమ—అవును మిక్కిలిమంచిరంగు. తామ్రవర్ణమునకు మించినరంగేదియులేదు.

చారు—ప్రభుభోజనమందలి రొట్టెను దాఁకుట యెంతపవిత్రమో, దీనిముద్దు లంతపవిత్రమయినవి.

కమ—రతీదేవి ప్రాఁతవగుటచేఁ దీసివైచిన పెదవులనితండు కొని ధరియించుకొని యుండఁబోలు. మంచువలెఁ జల్లనైన పరివ్రాజికయొక్క ముద్దులకన్న మిగులఁ బవిత్రమైనవి. అట్లయిన నేఁటియుషఃకాలమునకే వచ్చెద నని సమయముచేసి యింత దనుకఁ దడయఁ గారణంబేమి ?

కమ—అట్లయిన నాతఁ డసత్యవంతుఁడే.

చారు—నీవట్లే యనుకొనెదవా ?

కమ—అవును. పశ్యతోహరుండును, గజదొంగయుఁ గాఁడుగాని యనురాగవిషయమున నాతఁడు కడిగిబోర్లించిన బూరెలమూకుడుతోను బురుగుదొలిచినబాదముకాయతోడను బోల్పఁదగినవాఁడు.

చారు—అనురాగవిషయమున నాతఁడు విశ్వసనీయుఁడు కాఁడందువా?

కమ—హృదయమునఁ గలిగినయెడల విశ్వసనీయుఁడే. అట్లు కలుగలేదనియే నానమ్మకము.

చారు—తాను దృఢముగాఁ బ్రేమించితినని ప్రమాణముఁ జేయుట నీవు వినియేయుంటివి గదా!

కమ—"ప్రేమించితి" ననునది "ప్రేమించుచున్నా" నని యెట్లగును? ఇంతియేగాక, కాముకుఁ డొనర్చుప్రమాణములు మద్యము నమ్మువానిమాటల

వంటివి. వీరిద్దఱును దప్పుడులెక్కలను స్థిరపఱచుచుందురు. ఆతఁడు నీతండ్రియైన భూపాలునకీయరణ్యమునందే సన్నిధానవర్తియై యుండెను.

చారు—నిన్నఁటిదినంబున నేను మాతండ్రిం గలిసికొని చాలతడవు ముచ్చటించితిని. ఆయన నీతలిదండ్రు లెవ్వరని ప్రశ్నించెను. మీయంతటివారే యని సమాధానము చెప్పితిని. పిమ్మట హాస్యముఖుఁడై నాకు సెలవొసంగెను. భీమబలునంతటివాఁడు గలిగియుండఁ దలిదండ్రులప్రస్తావన యేల?

కమ—ఆహా! అతఁడు మిగుల ధైర్యశాలి. మిక్కిలి గంభీరము లగు గీతములు వ్రాయును. సాహసోక్తులు పలుకుచుండును. దృఢమయిన శపథములతోఁ బ్రమాణము చేయును. దృఢముగా భంగపఱచును. బహుకుటిలుఁడు, తనప్రేయసి హృదయమును వికలపఱచును. బేలడేగవలెఁ గుంత ఖేలనంబున నొక్కముఱు గాలఁ దనగుఱ్ఱమును దన్ని వక్రమార్గమున నడిపించి భగ్నభల్లుఁడయిన యశ్వసాదివంటివాఁడు. కాని యౌవనమధిష్ఠించి యజ్ఞానము మార్గదర్శిగా నున్నపుడు సర్వమును సత్యమయి కాన్పించునుగదా! ఎవఁ డావచ్చువాఁడు?

అంగదుఁడు — (ప్రవేశించి) యజమానురాలా ! నాఁడు పచ్చికబయట నాతోఁ గూర్చుండిన గర్విష్ఠురాలు దురహంకారిణి యు నగు ప్రేయసిం గొనియాడుచు నది తన్నుఁ బ్రేమింపమికి నిందించుచు నుండిన గొల్లవానిం గూర్చి మీరు తఱుచు ప్రశ్నించుచుందురు.

కమ —వాని ప్రచార మేమి?

అంగ—గాఢానురాగముయొక్క వెలవెలఁబోవుపాండురవర్ణంబునకును, గర్వాహంకారతిరస్కారములయొక్క దేదీప్యమాన మగురక్తవర్ణంబునకును, గల తారతమ్యముయొక్క చక్కని ప్రదర్శనముం జూడఁగోరితిరేని యిచ్చటనే యించుక దూరమునకు నాతోడ వచ్చితిరేనిఁ గాంచఁగలరు.

చారు—ఓహో! మనము పోవుదము రండు. కాముకులసందర్శన మితరకాము



కుల కాహారమైయుండును. (అంగదు నుద్దేశించి) మమ్ము నచ్చటికిం గొనిపొమ్ము. వారిప్రేమరంగమున నేనొకముఖ్యపాత్రము నైతినని నీవు చెప్పుట కవకాశము గల్గించెదను.

(అందఱునిష్క్రమింతురు.)

## ౫-వ రంగము.

### అరణ్యములోని మఱియొకప్రదేశము.

(భద్రుఁడు, కలహాశీల ప్రవేశించుచున్నారు.)

భద్రుఁడు—నాముద్దుల కలహాశీలా! నన్నుఁదిరస్కరింపకుము. కలహాశీలా! అట్లు చేయవలదు. నేను నిన్నుఁ బ్రేమింపలేనని చెప్పుము. కాని యటులాగ్రహముతోఁ జెప్పకుము. నిరంతరము పలువుర కుత్తుకలఁ గోయుటచేఁ గఠినచిత్తుఁడయిన తలారి తొలుత క్షమాపణము చెప్పక వంచఁబడిన కుత్తుకపై కరవాలము నిడఁడు. నెత్తురుజీవనము సేయునాతలారికంటెను క్రూరదృష్టితోఁ జూచెదవా ?

(వెనుకనుండి చారుమతి, కమల, అంగదుఁడు ప్రవేశించుచున్నారు.)

కలహాశీల—నేను నీకుఁ దలారి నగుటకు నాకిష్టము లేదు. నీకు హానిచేయు తలంపు నాకు లేదు. కావునఁ దొలఁగియే తిరుగుచుందును. నాకంటి యందు హత్య కలదని చెప్పుచున్నావు.

గీ. నాకనులలోన మృత్యువున్న దని నీవు
పల్కెదవు నీదుమాట భావ్యంబుగాదు,
దక్షత యొకింతలేక మార్దవము గల్గి,
రేణువులకైన భీతిల్లి రెప్పలార్చు

కన్నులను, ద్రోహులనియును, గటికలనియు,
ఘాతుకులటంచుఁ జెప్పుట నీతియగునె. 47

మనస్ఫూర్తిగా నాక్రోధదృష్టులు నీపైఁ బ్రయోగించెదను. నాదృష్టులకు గాయముఁ జేయు శక్తియే యున్నయెడల నిన్నుఁ బొడిచి చంపనిమ్ము. మూర్ఛ నటింపుము. ఇంకను గ్రిందఁబడవేమి? అట్లు పడలేకపోయితివేని నానేత్రములు మృత్యుదాయకము లని పలికి యనృతమాడినందులకుఁ ఛీ ఛీ! సిగ్గుపడుము. సిగ్గుపడుము. నాకన్నులు నీకెచ్చట గాయములఁ జేసినవో కనఁబఱుపుము. ఒకగుండుసూది పెట్టి గీఁచుకొన్న మచ్చపడును తుంగపై నించుక యానుకొనిన నీయఱచేత క్షణకాలమైన నానవాలుండును. కాని నీపై నేను బ్రసరింపఁజేసిన దృష్టులు నీకు హానిచేయఁజాలకున్నవి. హానికరమైన సామర్థ్యము నాకన్నులకుఁ గల దని నేననమ్మను.

భద్రుఁడు—ఓ ప్రియమైన కలహశీలా! ఎన్నఁడైనను—ఆయెన్నఁడు త్వరలో సమీపించిన బాగుగనుండును. మోహాధికారమును మఱియొకని ముఖము నందు నీవు కాంచినయెడలఁ దీక్ష్ణములైన మోహబాణములయొక్క యదృశ్యము లయిన గాయములను నీవు తెలిసికొనఁగలవు.

కలహ—అట్లయిన నంతవఱకును నీవు నాచెంతకు రావలదు. ఆసమయము వచ్చినపుడు కరుణఁజూడక నీవెక్కిరింతలచే నన్ను బాధింపుము. అంత వఱకు నిన్ను నేను గణింపను.

చారు—(పరిక్రమించి) ఏలాగో చెప్పుము. అదృష్టహీనుల నవమానించి యేకకాలమున సంతోషించుచుంటివి. ఇట్టి నీతల్లి యెవరు? నీవించుక యందకత్తె వైన నేమి?—

గీ. శయనగృహముల ఘనతమిస్రంపువేళ
నేగునప్పుడు కాంతివిహీన లౌట



దీపికలు గొనిపోవు ముద్దియలకన్న
నెంతచక్కనిదానవే యింతి నీవు. 48

అందునకు గర్వించి నీవు దయలేనిదానవు కావలయునా! ఇదేమిచిత్రము! నావంకఁ జూచెదవేమి?

క. భువనమను యంత్రశాలా
భవనంబున, సిద్ధుగు స్వభావముచేతం
దవిలి సృజింపఁగఁబడువ
స్తువులన్నిటికన్న నధికసుందరి వఁటవే! 49

ప్రమాణపూర్తిగా నిది నాకనులను గూడ భ్రమింపఁజేయవలె నని చూచుచున్నది. ఓగర్విష్ఠురాలా! ఈవేషములు నాయొద్ద సాగవు. నీవెన్నఁడు నందు కాశింపకుము. కలిసికొని పోయిన కనుబొమలును, మొక్కజొన్న పొత్తుపీఁచువంటి శిరోజములును, పిల్లిగ్రుడ్లవంటి కన్నులును, వివర్ణములయిన చెక్కులు, నివియా నన్ను దాసునిగాఁ జేసికొనఁగలిగినవి! (భద్రు నుద్దేశించి) ఓ వెఱ్ఱిగొల్లవాఁడా! ఉఱుములు మెఱుపులతో, నుత్తరదిక్కు నుండి వచ్చుగాలివానవలె దీనివెంటఁ బడెదవేమిరా! దానిస్త్రీత్వముకన్న నీపురుషత్వము వేయిమడుంగులెక్కుడుగా నున్నది. నీవంటినిర్భాగ్యులే ప్రపంచమునంతను వికృతాకారములుగల పిల్లలతో నింపుదురు. అద్దము వెల్లడింపని దానిసౌందర్యమును నీస్తుతిపాఠములు వెల్లడించుచున్నవి. అది తనయవయవసౌష్ఠవములను జూచుకొని సంతసించుటకంటె నీబట్టుపొగడికలవలన నెక్కుడుగా గర్వించుచున్నది. (కలహశీల నుద్దేశించి); అవునుగాని, ఓసీ! నిన్ను నీవు తెలిసికొనుము. ఇంతటియోగ్యుని ప్రేమానుబంధము నీకొసంగినందుల కుపవసించి సాష్టాంగనమస్కారంబు లాచరించి దేవునిఁ గొనియాడుము.

గీ. విను మతిరహస్య మొకటి చెప్పెదను నీకుఁ,
గొనఁగవచ్చినయపు డమ్ముకొనుము నిన్ను;
నెల్లసంతల నమ్మంగఁజెల్లు నీవు;
వానిదయఁగోరి, ప్రేమించి, వానిపాద
ములకు మ్రొక్కుము; నీయందమునకుఁ దోడు
తూలనాడెదె వానిఁ గయ్యాలమారి ! 50

(భద్రునుద్దేశించి) గోపాలకా ! ఆమెను జేరందీసికొని సుఖింపుము.

కలహ—ఓ. సౌందర్యరాశీ ! నీవొకయేఁడాదివనుకఁ దిట్టుచుండినను సంతోషముతోఁ బడియుండఁగలను గాని వీనియుపసర్పణము నంగీకరింపఁజాలను.

చారు—దీనియేబ్రాసితనముం జూచి నీవు ప్రేమించితివి. నాక్రోధమును జూచి నన్నిది ప్రేమించినది. అట్లయినచో నది నీకుఁ గ్రోధదృష్టులతోఁ బ్రత్యుత్తర మిచ్చినతోడనే నేను దీనికి దూషణభాషణంబులఁ జవిచూపెదను.

కల—నీయందు నాకనిష్టము లేనప్పటికినా ?

చారు—నిన్ను బతిమాలుకొనియెదను, నాపైని మాత్రము కన్నువేయకుము. ఏలయన, నాప్రతిజ్ఞలు త్రాగుఁబోతుమాటలకన్నను గల్లలైనవి. పయిగా నీయందు నాకనురాగము లేదు. నాయిల్లు నీకుఁ దెలిసికొనవలయు నను కోరిక యున్నచో నచ్చటనే యున్న మామిడితోఁపునఁ గలదు. కమలా! వచ్చెదవా ? గోపాలకా ? ఆమెను మిక్కిలి దృఢముగా నుపసర్పింపుము. చెల్లెలా పోవుదము రమ్ము. కలహాశీలా ! వానిని దిన్నఁగాఁ జూచుకొమ్ము. గర్వింపకుము ప్రపంచమంతయుఁ దిరిగిచూచినను వీనివలె మోసపడువాఁడెవ్వఁడును లేఁడు. మావుందయొద్దకు రమ్ము.

(చారుమతి, కమల, అంగదుఁడు నిష్క్రమింతురు.)

కమ—కీర్తిశేషుఁడ వైనయొకవీశ్వరుఁడా !



గీ. ప్రథమదర్శనవేళ సంభవము గాని
గాఢమోహానుబంధంబు గలిగెఁ బిదప
నెవ్వనికటంచు నీవచియించినట్టి
పల్కు నాయెడ నిక్కమై పరఁగె నేఁడు. 51

భద్రు—ముద్దుల కలహాశీలా!

కల—ఆఁ! భద్రుఁడా! ఏమనుచుంటివి?

భద్రు—ఓ నాముద్దుల కలహాశీలా! నామీఁద నెనరుంచుము.

కల—భద్రుఁడా! నిన్నుఁగూర్చి విచారించుచునే యుంటిని.

భద్రు—ఎచ్చట విచారము గలుగునో యచ్చటినుండియే దుఃఖశాంతి గలుగును. నేను మోహముచే దుఃఖించుచుంటి నని నీవు విచారించు నెడల ప్రేమదానముచే నీవిచారమును నాదుఃఖమునుగూడ నువ్వెత్తుగ నొక్కుమ్మడి మొదలంటఁ బెఱికివేయఁబడును.

కల—నీవు నాప్రేమను గలిగియే యుంటివి. అది యిరుగుపొరుగువారికి సహజధర్మమే గదా?

భద్రు—అట్లయిన నీవు నాకుఁ దక్కినట్లే.

కల—ఇది కేవలము దురాశయే. భద్రా! నేను నిన్నొకపుడు ద్వేషించితిని. ఇంకను నిన్నుఁ బ్రేమించితి నని తలంపకుము. మోహమును గూర్చి నీవింత చక్కఁగా నుచ్చటింప నేర్చినవాఁడవు గావున నింతకుముందు నాకసహ్యమయిన నీసహవాస మిప్పుడు సహ్యమయ్యెను. నిన్ను సేవకునిగాఁ గూడఁ గైకొంటిని. నాసేవ లభించిన దనుసంతోషముకంటె నెక్కుడు ప్రతిఫల మాసింపకుము.

భద్రు—పవిత్రమును బరిపూర్ణము నగుప్రేమగలవాఁడ నయ్యు నీదయకు బీదవాఁడ నగుటచేఁ బఱగయే పెద్దపంటగా నాకుఁ బరిణమించెను. అప్పు

దప్పు డొకచిఱునవ్వు నాపైఁ జిల్కుచుండును. దానితో నేను జీవించెదను.

కల—ఇంతకు మున్ను నాతోఁ బ్రసంగించిన యౌవనుని నీవెఱుంగుదువా?

భద్రు—బాగుగా నెఱుంగను. కాని తఱచు వానితోఁ గలసికొనుచుంటిని. ఒకప్పుడు వృద్ధుఁ డయినగృహస్థుఁడు యజమానుఁడుగా నుండిన కుటీరశాద్వలములం గొనినవాఁ డీతఁడే.

కల—వాని నడిగినంతమాత్రమున నాతనిఁ బ్రేమించితి నని యూహింపకుము. ఆతఁడు చిరచిరలాడువాఁడు. అయినను వాఁడు చక్కఁగా మాటలాడును. వానిమాటలతో నాకేమిపని? మాటలాడువాఁడు వినువారిచేఁ బ్రేమింపఁబడినచో వానిసంభాషణములు సంతోషదాయకము లైయుండును. వాఁడు సుందరుఁ డైనబాలుఁడు. మిక్కిలి యందమగు వాఁడు కాఁడు. నిశ్చయముగా గర్విష్ఠుఁడుగాని వానిగర్వము వానికిఁ దగియేయున్నది. యౌవన మెచ్చినకొలఁది నింకను మంచిసుందరుఁడు కాఁగలఁడు. వాని యందలి శ్రేష్ఠగుణములలో ముఖ్యమయినది ముఖకాంతి. వీనికఠినవాక్కులు మనంబున కెన్నిగాయములు గలిగించునో వానినెల్ల వీనిమోహనదృష్టు లుపశమింపఁజేయుచుండును. వాఁడు మిగులఁ బొడవరి కాఁడు. వానివయస్సునకుఁ దగినపొడవుగలదు. వానిపిక్క లంతపుష్టికలవి కావు. కాని బాగుగనే యున్నవి. వాని యధరోష్ఠము దొండపండువలె మిగుల నెఱ్ఱనై కాంతిగలిగి ప్రకాశించుచున్నది. లోకములోని యేసుందరాంగులైనను వానిదేహమందలి ప్రత్యంగమును నావలెఁ బరిశీలించి చూచినచో వానియం దించుమించు బద్ధానురాగలై యుందురు. నేనుమాత్రము వానిని బ్రేమింపను లేదు హేయపడను లేను. కాని నేను వానిని బ్రేమించుటకన్న హేయపడుటకే మిక్కిలి కారణము గలదు. నన్నాతఁ డేలదూషింపవలయును? వాఁడు నాకన్నులు పిల్లిగ్రుడ్లనియు నాశిరోజములు మొక్క-



జొన్నపొత్తుపీఁచనియు నధిక్షేపించినాఁడు. ఇప్పుడు నాకు జ్ఞాపకము వచ్చుచున్నది. వాఁడు నన్ను మిగులఁ హేయముగాఁ దలఁచెను. నేను దిరిగి ప్రత్యుత్తరము చెప్పనైతిఁగదా యని యబ్బురముగా నున్నది. పోనిమ్ము. భయములేదు. వానిమాటలకుఁ బ్రత్యుత్తరము చెప్పనంత మాత్రమున నంగీకరించినట్లు గాదు. వానినిదూషించుచు నుత్తరము వ్రాసి యిచ్చెదను, భద్రుఁడా! తీసికొనిపోయెదవా?

భద్రు—ప్రియురాలా! తప్పక తీసికొనిపోయెదను.

కల—ఇదిగో, నిప్పుడే వ్రాసెదను, నేను వ్రాయఁదలఁచినదెల్ల నాహృదయమునందును, నామెదడునందును సిద్ధముగానే యున్నది. అప్రియముగాను, క్లుప్తముగాను వ్రాసెదను. భద్రుఁడా! నాతోడరమ్ము.

(నిష్క్రమింతురు.)

ఇది తృతీయాంకము.



శ్రీ

# చారుమతీపరిణయము.

## చతుర్థాంకము.

### 1-వ రంగము అరణ్యము.

(చారుమతి, కమల, ప్రియంవదుఁడు ప్రవేశించుచున్నారు.)

ప్రియంవదుఁడు—ఓనవయౌవనుఁడా! నిన్ను బాగుగాఁ దెలిసికొననిమ్ము.

చారు—నీవు విచారశీలుఁడవని చెప్పెదరే!

ప్రియం—నేనట్టివాఁడనే ప్రమాదముకన్న విచారమునే మిక్కిలిగాఁ బ్రేమించెదను.

చారు—ఈరెంటిలో దేనినైనఁ బరమావధివఱకు నవలంబించువాఁడు హేయతకుఁ బాత్రుఁడగును. ఈకాలమువారు సర్వజనసామాన్యమగు నిందను మద్యపాయులకన్న నెక్కుడుగఁ దమపయికిఁ దామే తెచ్చుకొందురు.

ప్రియం—విచారభావముతో మౌనమును వహించియుండుట మిగుల మంచిది.

చారు—అటులైన స్తంభభావమునందుట మఱియు మంచిది.

ప్రియం—సీ. అహమహమికతోడ నన్యోన్యమును మించ
డీకొనుదంభపండితులయుడుకు
మిథునానురాగంబు మేకొల్పు గీతుల
వలపుఁబడు గాయకులకలంత
విభునాశ్రయమున గర్విష్ఠులై కనులుమూఁ
తలువడ్డ యాస్థానికులతపంబు



నొండొరుల్ విజయేచ్ఛ నుంకించి పోరాడు
క్రూరశూరుల యహంకారకలన
గీ. న్యాయవాదుల యలకుతంత్రములవంత,
తరుణులకుఁ గల్గు కడుఁబట్టువలగుణంబు,
సకలసంగ్రహమైన కాముకులగోడు
నాకు గోరంతయైన నెన్నంగలేదు. 52

లోకమ్ములోని యనేకవస్తుసంఘములయొక్క తత్త్వజ్ఞానలేశములు సంగ్రహించిన భావసమూహమే నా వ్యసనము. ఇది ప్రపంచకభావములయందలి తదేకచింతతో నిరంతరముఁ జేయుదేశాటనంబువలన లభ్యమయినది.

చారు—దేశాటనముఁ గూడఁ జేసితివా? నిశ్చయముగా నీవిచారమునకుఁ దగినకారణము గలదు. ఇతరభూములను జూడఁగోరి యందులకై నీ భూముల నమ్మికొంటి వని తలంచెదను. సర్వమును గాంచి సర్వమును శూన్యముఁ జేసికొనుట వలన ధనికములైన నేత్రములును రిక్తములైన హస్తములును గలవాఁడ వైతివి.

ప్రియం—ఔను, గొప్పయనుభవశాలి నైతిని.

చారు—నీయనుభవమే నిన్ను విచారమున ముంచినది. ఇట్టిలోకానుభవముచేత విచారపెట్టఁబడుటకంటె నసందర్భప్రలాపములచే వినోదపడుటయే నామనోరథము. వీనికొఱకు దేశాటనముఁగూడఁ జేయవలయునా?

(భీమబలుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

భీమ—ఉ. ఓ ప్రియురాల! నీకిఁక శుభోదయముల్ సుఖముల్ లభించుతన్.

ప్రియం—ఓహో! మీరు పద్యములతో మాటలాడునెడల మీకు దేవుఁడే సాయపడునుగాక! ఇఁక నేను బోయెదను.

(నిష్క్రమించుచుండ)

చారు—అయ్యా! దేశాటనశీలా! నీవుసుఖముగాఁ బోయిరమ్ము.

గీ. ఏచగాఁ బల్కు వస్త్రము లెల్లగతులఁ
దాల్చు నీదేశజనుల నింవలనొనర్చు,
నీస్వరూపంబునకు నీకు నింపఁజేయు,
గాక దేశాటనఫలంబు గలదె నీకు. 53

ఓహో! తమరా! ఇంతవనుక నెచ్చట విచ్చేసియుంటిరి? తమరఁట! కాముకులఁట! ఇట్టిటక్కరివేషము నింకముందు సాగించునెడల ముందెన్నఁటికి నా చెంతకు రావలదు.

భీమ—ఓసుందరీ! నాచారుమతీ! నేను వాగ్దానముచేసిన గడువు నొకముహూర్త ముకన్న నతిక్రమింపలేదు గదా!

చారు—అనురాగవిషయమున ముహూర్తమునుగూడ నతిక్రమించెదవా? నిముసమును వేయిచీలికలు చీలి యొకచీలికయందలి సహస్రాంశమునైనను గాలయాపన మొనర్చినయెడల మదనబాణమును వానిహృదయము నొవ్వనాటక బాహువున దూసిపోయెనని నే నిశ్చయముగఁ జెప్పెదను.

భీమ—ప్రియురాలా! చారుమతీ! క్షమింపుము.

చారు—అటులుకాదు. ఇఁకఁ గాలయాపనము చేయఁదలఁచినచో నాయొద్ది కెన్నఁడును రావలదు. ఇంతకన్న నొక్కనికమూర్త ముపసర్పించినను నే నంగీకరించెదను.

భీమ—(తెల్లపోయి) ఒకకూర్మమా!

చారు—ఔను. కూర్మమే. అది యెంతమందముగా వచ్చినను, తనగృహమును నెత్తినిఁ బెట్టుకొని వచ్చును. వివాహమాడఁదగిన యువతికి నీకన్ననదియే యుచితము. అది యాత్మసంరక్షణమునకుఁ దగినయాయుధములతో వచ్చుట యేగాక తనభార్యయొక్క మర్యాదను గూడఁ గాపాడును.

భీమ—సౌశీల్య మపహాసభాజనము కాదు. నాచారుమతి కేవలము సుశీల.



చారు—నే నే నీచారుమతిని.

కమల—ని న్నటులు పిలుచుట నాని కిష్టముగనే యున్నది. అయినను వీనికి నీకన్న లావణ్యవతి యగునొకచారుమతి గలదు.

చారు—రారమ్ము. న న్ననుసరింపుము. అనుసరింపుము. నేనిప్పుడు మిగుల నాహ్లాదదశయం దుంటిని. నీయనుసరణము నంగీకరించుటకుఁ దగినస్థితియం దుంటిని. నేనిప్పుడు నిజముగా సత్యమయిన నీచారుమతినే యయిన యెడల నీవిప్పుడు న న్నేమని పలికెదవు?

భీమ—మాటలాడుటకు మున్నె ముద్దుఁబెట్టుకొందును.

చారు—అట్లుగాదు. ముందుగా మాటలాడుటయే మంచిది. పల్కుటకుఁ దగిన సావధానత లేక గద్గదభావము తటస్థించినపు డదియొక యాధారముగాఁ జూచుకొనవచ్చును. గొప్పయుపన్యాసకుఁడు తనవక్తృత్వాంశములయందు నాతంకము గలిగినపుడు కాలయాపనోపాయముగ సకిలించుచుండునట్టులు గాముకులకు ముచ్చటించుకొనుటకుఁ జతురవాక్యములు లేనపుడు—భగవంతుఁ డట్టియవస్థ మనకు నివారించునుగాక!—ముద్దుఁ బెట్టుకొనుటయే కర్తవ్యము.

భీమ—చుంబనము నిరాకరింపఁబడినపు డెట్లు?

చారు—అప్పు డామె నిన్నుఁ దన్ను బతిమాలుకొనునట్లు చేయును. అంత నూతనగాథకు మరలఁ బ్రారంభమగును.

భీమ—తనమోహనాంగి చెంగటనున్నపు డెవ్వఁడు మూఁగతనముఁ బూనును?

చారు—నేనే నీప్రేయసి నైనచో, నిశ్చయముగా నీకు వాగ్బంధనముచేసి యుందును. నేను నీచారుమతిని గానా?

భీమ—నీవే చారుమతి వనిచెప్పుటచే, చారుమతిం గూర్చినసంభాషణమే గావున నాకుఁ గొంత యానందకారణము గలదు.

చారు—సరే. ఆమెస్థానముననుండి ని న్నొల్లనని చెప్పెదను.

భీమ — అట్టులైన నాస్థానమున నుండి నేను జచ్చెదను.

చారు — అట్టులుగాదు. ఇందులకు నీకుమాఱుగ మఱియొకరిని సంధింపుము. ఈదీనప్రపంచము జనియించినదిమొదలు నేఁటివఱకు నించుమించు 6000 వత్సరంబులైనను, మోహవశంబునఁ దనకుఁ దానే చచ్చినవాఁ డెవఁడును లేఁడు. తొల్లి జనకపుత్రి నాశించి దశకంఠుఁడు తనమరణంబునకుఁ దగినసన్నాహము నాచరించుకొనెను. మోహనిమిత్తమున నాశనము నొందినవారిలో నీతఁ డొకరీతివాఁడు. మఱియు వియాండరనునొకపురుషుఁడు తనప్రేయసి యోగినియైనను, నొక గ్రీష్మకాలరాత్రియం, దొకనదియందు స్నానమొనరింపకుండినఁ జిరకాలము జీవింపఁదగినవాఁడే. అట్లుచేయుటచే వాతరోగమున మడిసెను. అందువలన నప్పటిగ్రంథకర్తలు కొందఱు సత్యమును గప్పిపుచ్చి తనప్రేయసికై మృతినొందెనని వ్రాసియుండిరి. ఇవన్నియు నసత్యములు. అప్పుడప్పుడు మనుజులు మరణించుటయుఁ, గ్రిమిసంఘముచే భక్షింపఁబడుటయుఁ గలదుగాని యన్నిటికి మోహము మాత్రము నిమిత్తముగాదు.

భీమ — నానిజమయినచారుమతి మనోభావ మిట్లుండ నే నిష్టపడను. ఏలయన, ఆమెకోపదృష్టి నన్ను నిజముగాఁ జంపఁగల దని ప్రమాణముచేసి చెప్పఁగలను.

చారు — అది యొకయీఁగనైనను జంపఁజాల దని నాయానగాఁ జెప్పెదను. నేను మిక్కిలి సౌమ్యభావముతో నీచారుమతినై యుండెదను. రారమ్ము. నీయభీష్టమును వేఁడికొనుము. నేననుగ్రహించెదను.

భీమ — అట్లయినఁ జారుమతీ ! నాపై వలపు నిలుపుము.

చారు — అవును. నిశ్చయముగఁ బర్వదినములయందు సహితము నట్లుచేసెదను.

భీమ — నీవు న న్ననుగ్రహింతువా ?

చారు — నిశ్చయముగ నిరువదిమంది భీమబలులనైనను



భీమ — నీ వేమనుచున్నావు ?

చారు — నీవు మంచివాఁడవు కావా ?

భీమ — మంచివాఁడననియే తలంచెదను.

చారు — అట్లయినయెడల, మంచికి మేరయెక్కడిది ? కమలా ! రమ్ము. నీవు యాజకత్వమును వహించి మాకు వివాహముఁ గావింపుము, భీమబలుఁడా! నీచేతిని నాకిమ్ము. కమలా ! చూచెదవేమి ?

భీమ — మాకు వివాహమును గావింపు మని వేఁడుకొనుచున్నాను.

కమ — నా కామంత్రములు రావే !

చారు — నీవిటులు ప్రారంభింపవలెను.

"శ్లో॥ కన్యాం కనకసంపన్నాం కనకాభరణైర్యుతామ్
దాస్యామి విష్ణవే తుభ్యం బ్రహ్మలోకజిగీషయా" 54

కమ — చాలుఁజాలు. (మంత్రముచదువును)

భీమ — నే నట్లే చేసెదను.

చారు — ఓహో ! యెప్పుడు ?

భీమ — ఇప్పుడే. మన కీకమల వివాహ మెంతశీఘ్రములోఁ జేయింపఁగలిగిన నంతలో —

చారు — అట్లయిన నీ వీమంత్రము నుచ్చరింపవలెను. (మంత్రము)

భీమ — (మంత్రముచదువును) —

చారు — నీకుఁ గలయధికారపత్రమును గనఁబఱుపుమని ని న్నడుగవచ్చును. ఐనను, ఓభీమబలుఁడా! నాభర్తగా నిన్నుఁ జేపట్టెదను. (కమల నుద్దేశించి) యాజకుఁడు చెప్పకపూర్వమే నేను జెప్పితిని. స్త్రీలకు మనస్సు వారికార్యములకన్న ముందే నడచుచుండును.

భీమ — తలంపు లన్నియు నట్టివే. వానికి లెక్కలుగలవు.

చారు—చారుమతి నీయక్షీన మైనపిమ్మట, విడువక యెంతకాలముంచుకొనె దవో నాకుఁ జెప్పుము.

భీమ—సర్వకాలము నొకనాఁడుగా—

చారు—"సర్వకాలము" విడిచి "ఒకనాఁడు" అనిన బాగుగనుండును. కాదు. కాదు. భీమబలుఁడా!

ఉ. స్త్రీలను బెండ్లికై యనుసరించెడువేళ, జనుల్ వసంతముం
బోలెఁ జరింతు రాపిదపఁ బోలుదు రుగ్రత గ్రీష్మకాలముల్;
స్త్రీలును దమ్ముఁ బూరుషులు చేరెడువేళ వసంతకాలముం
బోలి యు నంత గ్రీష్మవిమూర్ఛితమాలతివోలె వాడరే! 55

సీ. పుంజు పెట్టను గాచుపోల్కిగా నిన్నన్య
కాంత లంటకయుండఁ గాచియుందు
వర్షాగమమునందు వదరుకీరముకన్న
మిన్నగా జగడంబుఁ బన్నుచుందు
నారణ్యకుఁడు వోలె నగపడ్డవింతవ
స్తువులెల్లఁ దెమ్మని తోలుచుందు,
శాఖాచరమువోలెఁ జపలభావముతోడఁ
దీరనికోరుకుల్ గోరుచుందు,
గీ. నీవుసంతోషమున నుండ నీటియొడ్డు
నందు వాపోవుపెద్దమ్మయట్టు లేడ్తు,
నీవు సుఖముగ నిద్రింపఁబోవువేళఁ
బకపకని నవ్వుదాన పిశంగివోలె. 56

భీమ—నాచారుమతియు నట్లేచేయునా?

చారు—నే నెట్లుచేయుదునో యామెయు నట్లేచేయు నని నాప్రాణముల నొడ్డి పందెము వైచెదను.



భీమ—ఓహో! కాని యామె చాల జ్ఞానవంతురాలు.

చారు—కావున నే యిట్లు చేయఁగలిగియుండును. జ్ఞానముకొలఁది నపమార్గము. స్త్రీలచాకచక్యము ద్వారముమూసిన యెడల గవాక్షమునుండియు, నదియు మూసినయెడల బీగపురంధ్రమునుండియు, నదియుఁ గప్పినచో ధూమనాళమునుండియు వెలువడకమానదు.

భీమ—అట్టితెలివితేటలు గల భార్య గలపురుషుఁడు "చాకచక్యమా! ఎచ్చటికిఁ బోయెదవు?" అని యడిగిన నడుగవచ్చును.

చారు—అట్లుగాదు. నీయింతిచాకచక్యము వానిఁ దనపల్లవుని శయ్యకుఁ దార్చునంతటి దగునంతవఱకును నీవాప్రశ్నమును దాఁచియుంచుము.

భీమ—అట్టిస్థితిని క్షమింపఁగలుగుట కెంతటితెలివితేటలు నాకుఁ గలిగి యుండవలెను!

చారు—దైవము సాక్షిగా నేను నిన్ను వెదకుటకే వచ్చితినని చెప్పఁగలదు. నీవు వాగ్బంధనముం జేసినను దప్ప, నీకుఁ దగినప్రత్యుత్తర మీయఁజాల నంతటి స్థితిలో నీవామెను బట్టుకొనఁజాలవు. తన నేరమునకుఁ దనభర్తనే ముఖ్యకారణముగా నిరూపింపఁజాలని స్త్రీ తనశిశువులకు స్తన్యమొసఁగి పెంచుట కనర్హురాలు. ఏలయన, వారినిఁగూడఁ దనయంతటి బుద్ధిహీనులుగఁ జేయఁజాలును.

భీమ—చారుమతీ! రెండుముహూర్తములు నిన్ను విడిచియుండవలెను.

చారు—ప్రాణప్రియా! అంతకాలము విడిచి నే నెట్లుండఁగలను?

భీమ—రాజుగారు భోజనము చేయువేళ నే నచ్చట నుండవలెను. రెండు ముహూర్తములలో నిన్ను మరలఁ గలసికొందును.

చారు—అయ్యో! నీదారిని నీవు పోయెదవా? నీదారిని నీవు పోయెదవా? నీ వెట్లుగాఁ బరిణమింపఁగలవో నే నెఱుఁగుదును. నామిత్రులు గూడ నట్లే చెప్పిరి. నేనును నిన్నుఁ దక్కువవానినిగా భావింపలేదు. స్తుతిపాత

ముల కలవడిన జిహ్వయే నన్ను గెల్చినది. నేనిపుడు పరిత్యక్తురాలనయితిని. కాన నోమనోరణమా! నన్ను వగ్గలుము. నీనియమితకాలము రెండుముహూర్తములే కదా!

భీమ — చారుమతీ! అట్లనెదవేమి?

చారు — నీసమయములో వీసపుమాత్రమైన భంగపఱిచినను నీనియమితముహూర్తమున కొక్కనిముస మతిక్రమించివచ్చినను, సత్యముతోడుగా, విధాయకముగా, దైవసాక్షికముగా, ననపాయములైన మృదుశపథము లన్నిటితోడుగా హేయపడఁదగినంతటి ధూర్తునిగాను గపటశీలుఁడవైనకాముకునిగాను, నీచారుమతి కనర్హునిగాను, విశ్వాసఘాతుకుల మెట్టుసంఘములో నెన్నఁదగినవానిఁగాను భావించెదను. జాగ్రత్త. నాశపథములు జ్ఞప్తి నుంచుకొని నీసమయము నతిక్రమింపకుము.

భీమ — నీవు నిజముగా నాచారుమతివే యైనయెడల దైవముఖమును జూచి యెట్లో యట్లే, కావున సెలవిమ్ము.

చారు — అట్లే కానిమ్ము. నీసమయముయొక్క సత్యాసత్యములను, విమర్శించుటకనాదియైన కాలమే వృద్ధుఁడైన న్యాయాధికారి కాఁగలదు. పోయిరమ్ము.

(భీమబలుఁడు నిష్క్రమించును)

కమ — నీప్రేమప్రలాపములలో మనస్త్రీజాతిని కేవలము దుర్వినియోగపఱిచితివి. మేము నీమేననుండి పురుషభూమిక నెడలించి నీయింటికి నీవు చిచ్చుముట్టించితి వని ప్రపంచకమునకు వెల్లడిచేసి తీరవలెను.

చారు — అయ్యో! కమలా! కమలా! కమలా!! నాముద్దులకమలా! నేను మోహసముద్రమున నెన్నితాళ్లలోఁతున నుంటినో నీకుఁ దెలిసిన బాగుగనుండును గదా! దాని గాంభీర్యము మిగుల నగణ్యము. నామోహము బంగాళాఖాతముగాఁ దెలిసికొనఁజాలనిది.



కమ — అతల మని చెప్పరాదా! అట్లయిన నీప్రేమను బూరించినతోడనే వెడలిపోవును.

చారు — అట్లుకాదు.

గీ. పైత్యకోశంబు క్షేత్రభావంబునొంద,
మనసు బీజంబుగాఁగ, నున్మాదదశను
బుట్టి, జాత్యంధుఁడై, చలపట్టి, జనుల
కనుల మోహాంధముం జేయఁగల, యనంగుఁ
డిపుడు నాప్రేమపరిమాణ మేర్పరింపఁ
గలుగున్యాయాధిపత్యంబు సలుపుఁగాక!

కమలా! ఆభీమబలుని నాదృష్టిపథమునుండి విడిచి నిలువఁజాలను. నేను తరుచ్ఛాయకరిగి యాతఁడే తెంచువఱకును నిట్టూర్పులతోఁ గాలముఁ బుచ్చెదను.

కమ — నేను నిద్రించెదను.

(అందఱు నిష్క్రమింతురు)

## 2-వ రంగము — అరణ్యము.

(ప్రియంవదుఁడు, సామంతులు, ఆటవికులుఁ బ్రవేశించుచున్నారు.)

ప్రియం — ఈహరిణముం జంపినవా రెవరు?

సామం — అయ్యా! నేనే.

ప్రియం — శత్రువుల జయించిన సేనానిం బోలె వీనికి విజయసూచకముగ నీహరిణశృంగముల మూర్ధాలంకారముఁ గావించి రాజునకు సమర్పింతము. (ఆటవికునుద్దేశించి) ఓవనచరుఁడా! ఇందులకనురూపమగు గీతముం బాడఁగల్గుదువా?

ఆట — చిత్తము. పాడఁగలను.

ప్రియం—పాడుము. శ్రుతి, తాళము, ఎట్లున్నను, చప్పుడు మాత్రము చేసినఁ జాలును.

ఆట—ఉత్సాహ. మిఱ్ఱు పల్లములను జూచి మెల్ల నడుగు లిడుమురా
యిఱ్ఱిపోతు దీనిమోయ నెంతో సంతసంబురా
బుఱ్ఱ యాడుచుండె నూడిపోవునేమొ పట్టరా
యఱ్ఱు వాఁచె క్రిందదింపు మచట వేఁడుకొందురా.

(పాడుచునిష్క్రమింతురు)

### 3-వ రంగము—అరణ్యము.

(చారుమతి, కమల ప్రవేశించుచున్నారు)

చారు—నీవేమనెదవు? రెండుముహూర్తములు దాఁటలేదా? భీమబలునిఁ జక్కఁగాఁ జూచుచుంటిని.

కమ—ఆతఁడు నిర్మలమయిన ప్రేమయును, గలఁతవారిన హృదయమును గలవాఁడై ధనుర్బాణంబులఁ జేతఁబట్టి నిద్రకు బయలుదేఱి వెళ్లెను. చూడుము. ఎవఁడో వచ్చుచున్నాఁడు.

(భద్రుఁడు ప్రవేశించుచున్నాఁడు)

భద్రు—యువకుఁడా! నాపూజ్యురాలైన కలహాశీల నీకు దీని నొసంగ నాజ్ఞాపించినది. (అని యుత్తరమును జేతి కిచ్చును) ఇందలిసంగతులు నేనెఱుఁగను. కాని యామె యీలేఖను లిఖించుకాలమందలి క్రూరమైన బొమముడినిఁ బట్టియుఁ గందురీఁగవంటి చేష్టనుబట్టియు, నీజాబు తీవ్రగతితో నుండునని యూహించెదను. నేను నిర్దోషియైన వార్తాహారిని. నన్ను క్షమింపుము.

చారు—శాంతియే యీయుత్తరముం గాంచిన, నదరిపడి పరుషములాడున దగును. దీని నోర్చినయెడల సర్వము నోర్చినట్లే. నేను సుందరుఁడను



గానఁట. నాకు మర్యాద లేదఁట. గర్విష్ఠినఁట. పురుషుఁడు దొరకుట శశవిషాణమువంటిదైనను నన్నుఁ బ్రేమింపఁజాలదఁట. నామనస్ఫూర్తిగఁ బ్రకృతమున నేను వేఁటాడునది దానియనురాగశశంబుగాదు. అది నాకిట్లేల వ్రాయును? సరే. సరే. గోపకా! సరె. ఈయుత్తరము నీ కల్పనగాఁ దోఁచుచున్నది.

భద్రు—కాదుకాదు. అందలిసంగతులు నాకుఁ దెలియవు. కలహాశీలయే వ్రాసినదని నేను బ్రమాణముచేసి చెప్పఁగలను.

చారు—రారమ్ము. నీవు కేవలమూర్ఖుఁడవు. ప్రేమ యొక్క పరమావధిని బొందితివి. లిఖితమున దానిచేయి నేనెఱుంగుదును. దానిచేయి మార్దవమున మహిషచర్మమువలెను, లావణ్యమున నాఁపతాయివలె నుండెను. దానిం గాంచినపుడది జీర్ణమయిన తోలుచేయి తొడిగినట్లు కానిపించినది. కాని నిజముగా దానిచేతులే పనికత్తెచేతులు. దాని కేమిలెమ్ము. ఈయుత్తరము దాని కల్పనకాదు. లిఖితమును, గల్పనమును బురుషునివిగాఁ దోఁచుచున్నవి.



భద్రు—నిశ్చయముగా దానిదే.

చారు—ఈయుత్తరము మిగులఁ బరుషమైనట్టియు, క్రూరమైనట్టియు శైలితో వ్రాయఁబడినది. ఇది కయ్యమునకుఁ గాలుద్రవ్వువారి పరిణతినున్నది. అది మ్లేచ్ఛుఁడు క్రైస్తవునిపైఁ గాలు ద్రవ్వినట్లు నామీఁదికి వచ్చుచున్నది. స్త్రీల మృదువైన మెదడునుండి రాక్షసార్హమైన పారుష్యమును, స్వరూపముకంటె మిక్కుటమైన క్రియలయందలి మాలిన్యమును గలభాషణంబులు వెలువడనేరవు. నీవీయుత్తరమును విందువా?

భద్రు—మీ సెలవైన నట్లే. నేనిది వఱకు వినియుండలేదు. కాని కలహాశీల యొక్క క్రౌర్యమును మిక్కిలి వినియేయుంటిని.

చారు — దానికలహశీలత్వము నాపైఁ బ్రయోగించినది. ఈదుర్మార్గురా లెట్లు వ్రాసినదో చూతుము. (చదువును)

గీ. ఒక్క యవివాహితమనంబు నొగిరగుల్పఁ
బుడమి గోపాలుఁడవగు దేవుఁడవె నీవు—

ఆఁడుది ప్రేలఁదగినమాటలేనా యివి?

భద్రు — దీనిని నీవు ప్రలాప మందువా?

చారు — (చదువును)

గీ. నీదుదైవత్వమును వీడి నీరజాక్షి
హృదయము నెదిర్చి దురముఁ జేసెదవె నేఁడు— 59

నీ వెన్నఁడైన నిట్టిప్రలాపమును వింటివా?

గీ. ఎవని కనులైన నన్నాశ్రయించునపుడు
నాకుహానిని గొల్ప వింతవఱ కెపుడు—

నన్నొకమృగమును గాఁ దలంచుచున్నది.

గీ. అరయ నీక్రూరదృష్టి మోహము దగుల్ప
నీదయాదృష్టి నింక వర్షింప నేల
నీదుపరుషోక్తులే ప్రేమఁ బాదుకొల్పఁ
బ్రార్థనావాక్యముల నింకఁ బల్క నేల! 60

మఱియు నీవార్తాహర్త నీయెడల నాకుఁ గల్గుప్రేమ నించుకైన నెఱుంగఁడు.

ఉ. నీపరిపూర్ణయౌవనము నీకరుణార్ద్రహృదయంబు నిక్కమా
నాపెరిమంపుఁగానుక గొనం దిలకించునొ లేదొ సమ్మతుల్
దోఁపఁగ లేఖవ్రాసి దయతో బయిముద్ర బిగించి దానినా
ప్రాపున కంపినన్ బ్రతుకొ ప్రాణవియోగమొ నిశ్చయించెదన్. 61

భద్రు — ఇదియేనా నిన్నుఁ దిరస్కరించుట.

కమల — అయ్యో! వెఱ్ఱిగొల్లనాఁడా!



చారు — (కమల నుద్దేశించి) నీవు వానిని దయదలఁచెదవా? వాఁడు దయాపాత్రుఁడు గాఁడు. (భద్రు నుద్దేశించి) దీనినేనా నీవు ప్రేమించునది! ఏమిది? నిన్నొక సాధనముగాఁ గైకొని నీపయికపటనాటకమును బ్రదర్శించుచున్నది. ఇది మిగుల దుస్సహమైనది. సరే. నీప్రేమ నిన్నుఁ బెంపుడుపాముగాఁ జేసినది. కావున నీవు దానిచెంతకుఁ బోయి నాముఖముగా నిట్లు పలుకుము. అది నన్నుఁ బ్రేమించునెడల నిన్నుఁ బ్రేమింపుమని దాని నాజ్ఞాపించుచున్నాను. అది యట్లు చేయనియెడల నీవు ప్రార్థించునంతవఱకు నేను దాని నంగీకరింపను. నీవు నిజముగఁ గాముకుఁడవైనయెడల నొకనిముసమైన నిచ్చట నుండక శీఘ్రముగాఁ దొలఁగిపొమ్ము. ఎవరో మిత్రులు గూడ వచ్చుచున్నారు.

(భద్రుఁడు నిష్క్రమించును, ప్రద్యుమ్నుఁడు ప్రవేశించును)

ప్రద్యు — సుందరులారా! వందనములు. ఈయరణ్యప్రాంతమున మాకందవనములోఁ గలగొఱ్ఱెలసాల యెచ్చటనో చెప్పఁగలరా?

కమ — ఇచ్చటి కీశాన్యభాగమునఁ గలలోయలో రొదఁజేయుచుఁ బ్రవహించుచున్న సెలయేటియొడ్డున నల్లుకొనిన ప్రబ్బలిచెట్ల చాలును దాఁటి కుడిచేతిమీఁదుగఁ బోయినయెడల నాతావునకుఁ జేరఁగలవు. ఇప్పుడాకుటీరము తనంతటఁదానే యున్నది. అం దెవ్వరును లేరు.

ప్రద్యు — నాలుకవలనఁ గన్న ఫలితమును బొందఁగలుగునెడల, వర్ణనవలన మిమ్ములను దెలిసికొనఁగలను. అదేవయసు; అవేవస్తులు; పిల్లవాఁడు సొగసరి, స్త్రీలక్షణములు గలవాఁడు, ఆమెకుఁ బెద్దసోదరివలెఁ గాన్పించును. ఈబాలిక సోదరునికంటెఁ గుఱుచయై చామనచాయగలది. నేనిదివఱకుఁ బ్రశ్నించిన యింటియజమానులు మీరేకదా!

కమ — మీరడిగితిరి గావున మేమే యని చెప్పుట గర్వోక్తికాదు.

ప్రద్యు — భీమబలుఁడు మీకుఁ దనవందనము లర్పించుచున్నాఁడు. తాను దనచారుమతి యని పిలుచుకొను యౌవనపురుషునకు రక్తసిక్తమైన యీ వస్త్రమును బంపుకొనెను. (చారుమతితో) ఆతఁడవు నీవేనా ?

చారు — నేనే. ఇందువలన మేమేమి గ్రహింపవలెను ?

ప్రద్యు — నాసైన్యములోఁ గొంతభాగము. నేనెట్టివాఁడనో, ఎప్పు డెచ్చట నెందునిమిత్త మీవస్త్రము రక్తసిక్త మైనదో ?

కమ — దయచేసి చెప్పుఁడు.

ప్రద్యు — భీమబలుఁడు కడపటిసారి మిమ్ముల విడిచి యేగునపుడు రెండుమహూర్తములలోఁ దిరిగి వచ్చెద నని సమయముచేసి —

గీ. కమ్రరసములు కొన్ని, తిక్తములు కొన్ని,
నైనమానసవృత్తి భక్ష్యముల నంది,
నెమరువేయుచు విపినమార్గమునఁ దప్పు
టడుగులను మెల్ల మెల్లన నరుగుచుండె. 70

ఆహా! ఎంతఘోర మెంతఘోరము! ఆతఁడు కన్నులెత్తి చూచువఱకు వాని కంటఁబడిన మహాద్భుతమును జెప్పెదను వినుఁడు.

గీ. వసుధఁ జిరకాలవాసంబు వలన నాచు
దట్టు నెఱమ్రాఁకులును, బురాతనము లగుటఁ
బులికి విఱిగిన గొడుగుకొమ్మలును గలిగి
వటమహీజంబు దారిఁ గన్పడియె నొకటి. 71

క. ఆసరసఁ బెరిఁగి మొగమున్
మూసినకేశములు గడ్డమును మీసములున్
మాసినవలువలు గలయే
బ్రాసియొకఁడు వెల్లకిలఁగఁ బడి నిదురింపన్. 72



గీ. శబలవర్ణంబు గలకృష్ణసర్ప మొకటి
భోగమున వాని మెడఁ జుట్టి బుసలుకొట్టు
తనశిరంబును వానివక్త్రంబునందుఁ
జొనుప యత్నించెఁ బ్రాణంబులను హరింప. 73

కం. అంతట భీమబలుండా
శాంతముఁ బోవంగ నదియు భోగము మెల్లన్
గొంతువదలించి వడిగాఁ
జెంతనికుంజంబుఁ జేరె శీఘ్రగతులతోన్. 74

ఉ. ఆపొదరింటిలోనఁ గడు నాఁకటితోడను వేగుచుండి వే
పాపలచేతఁ బిల్వఁబడి బక్కగ వ్రేలెడు జన్నుఁగట్టుతో
మూఁపు నొకింతగుంచి తనమోమును గ్రిందికి వంచి పొంచి పె
ల్లేపుననొక్కసింహి యితఁ డెప్పుడు లేచునొ యంచునుండె న
య్యేపగురాజచిహ్న చలియింపనిదాని గ్రహింపనీదుగా. 75

దీనిని గాంచి యాభీమబలుఁడు, ఆనిద్రించుమనుష్యుని సమీపించి తనజ్యేష్ఠసోదరునిగాఁ దెలిసికొనెను.

కమ — ఓహో! మానవజాతిలో నెల్ల నాతఁడు సహజవిరుద్ధమైన స్వభావము గలవాఁ డని భీమబలుఁ డీసోదరుని గూర్చియే చెప్పఁగా వినియుంటిని.

ప్రద్యు — ఆతఁ డట్టివాఁడే యని నేనెఱుంగుదును గాన భీమబలుఁడు సత్యమే చెప్పెను.

చారు — దీని కేమిగాని, భీమబలుని మాట — క్షుధార్దిత యగు నాసింహమున కాహార మగుటకు వానిని విడిచిపోయెనా ?

ప్రద్యు — రెండుసారులు విడిచిపోవ యత్నించెను గాని వైరనిర్యాతనముకన్న గౌరవభాజనమైన దయాస్వభావమును, నుపేక్షాకారణముకన్న బలవత్తరమగు సోదరభావమును, నాకేసరితోఁ గయ్యమునకుఁ బురికొల్పినవి. అంత

నాసింగము వీని బాహుప్రతాపాగ్ని కాహుతి యైనది. అట్టియుల్లోలకల్లోలంబున నుల్లంబు పెల్లుగఁ దల్లడిల్లి నాపాతునిద్రనుండి మేల్కాంచితిని.

కమ—నీవేనా వానిసోదరుఁడవు?

చారు—వానివలన నీయాపదనుండి తొలఁగింపఁబడినవాఁడవు నీవేనా?

కమ—వానిఁ బెక్కుసారులు పరిమార్ప నెంచినది నీవేనా?

ప్రద్యు—నేనే. ఈనేను గాను. మార్పునుజెందిన నాయీప్రకృతావస్థ నాకు మిగుల రుచ్యమయిన దగుటచే నాపూర్వావస్థ నింద్య మని చెప్పుటకు నేను లజ్జింపను.

చారు—ఇంతకు రుధిరారుణమయిన యీయుత్తరీయముగతి యేమి?

ప్రద్యు—ఓహో! చెప్పమఱచితిని. అప్పుడు మేముభయులముఁ బరస్పరానురాగసంకలితులమై చెప్పుకొనుచుండు మాదీనచరిత్రములను బాష్పపూరములు మిక్కిలి దయతో నార్ద్రీకరించినపిమ్మట—అతివిస్తరమేల—పూజనీయుఁ డగురాజునొద్దకుఁ దీసికొనిపోయెను. ఆతఁడు నన్ను నూతనవస్త్రధారణంబులను, షడ్రసాన్నపానంబులను సంతృప్తునిఁ జేసి, నన్నుఁ బ్రేమతోఁ జూడు మని నాసోదరునకుఁ జెప్పి యొప్పగించెను. నాసోదరుఁడు నన్నుఁ దనశిలాగృహంబునకుఁ గొనిపోయెను.

సీ. ఆశిలాగృహమున నాతఁ డంగీవిప్పి
హరికోరలను గండఁబెఱుకఁబడిన
ముంజేతిపై రక్తపూరంబుఁ గనుఁగొని
హాచారుమతి యని యాలపించి
మూర్ఛిల్ల నేఁ జేరఁబోయి సేదను దేర్చి
గాయంబునకుఁ గట్టుఁగట్టినంత
క్షణమాత్రమున ధైర్యకలితాంతరంగుఁడై
తనసమాచార మంతయును దెల్పి



గీ. లీల వాగ్దాన మొనరించుకాలమునకుఁ
దాను రాఁజాలనట్టి యీతప్పుఁ గావు
మనుచుఁ దాఁ జారుమతిపేర ననుసరించు
గోపబాలున కిమ్మని ఘోరరక్త
సిక్తవసనం బొసంగి పంచె నిటు నన్ను. 76

(చారుమతిమూర్ఛిల్లుచున్నది)

కమ—అన్నా! వసంతుఁడా! యిది యేమి?

ప్రద్యు—రక్తమును గాంచినపుడు పలువు రిట్లే మూర్ఛిల్లెదరు.

కమ—ఇంకను విశేషము గలదు. సోదరా! వసంతుఁడా!

ప్రద్యు—చూడుము! చూడుము! ఆతండు తెలివినొందుచున్నాఁడు.

చారు—(తెలివిఁదెచ్చుకొని) నేనింటియొద్ద నుండిన మేలుగ నుందును.

కమ—ని న్నింటికిఁ దీసికొనిపోయెదము (కుమతి నుద్దేశించి) దయయుంచి వీనికిఁ జేయూఁత నొసంగెదరా?

ప్రద్యు—యువకుఁడా! ధైర్యము నవలంబింపుము. నీవు పురుషుఁడవై యుండియుఁ బురుషచిహ్నమగు ధైర్యమునఁ గొఱఁత నొందితివేమి?

చారు—నే నట్లే చేయుచుంటి నని యొప్పుకొనక తప్పదు. ఆహా! నేను మిక్కిలి చక్కఁగా నటించితి నని యందఱుఁ దలంచెదరు. అయ్యా! నే నెంతబాగుగ నటించితినో నీసోదరునితోఁ జెప్పుము.

ప్రద్యు—ఇది యెన్నఁడు నటనగాదు. నీముఖకళయే నీయనురాగముయొక్కయాథార్థ్యమునకుఁ బ్రబలసాక్షిగా నున్నది.

చారు—ఇది సత్యముగా నటనయే.

ప్రద్యు—అటులైన మంచిదియే. ధైర్యము నవలంబించి పురుషునివలె నటింపుము.

చారు—అట్లే వచ్చెదను. నేను నిశ్చయముగ స్త్రీనై జన్మింపవలసినది.

కమ—నీవు మిగుల వెలవెలఁబోవుచున్నావు. ఇంటికిఁ బోవుదము. దయ యుంచి రమ్ము. (ప్రద్యుమ్ను నుద్దేశించి) అయ్యా! పూజ్యుఁడా! మా తోఁగూడ రమ్ము.

ప్రద్యు—అట్లే తప్పక చేసెదను. చారుమతీ! నీక్షమాపణసమాధానమును నాసోదరునకుఁ గొనిపోవలయును గదా!

చారు—ఆలోచించి చెప్పెదను. కాని నానటనమును మాత్ర మాతనికిఁ బూర్తిగ వెల్లడింపవలె నని కోరుచున్నాము. తాము దయచేసెదరా?

(అందఱు నిష్క్రమించుచున్నారు)

ఇది చతుర్థాంకము.



శ్రీ

# చారుమతీపరిణయము.

## పంచమాంకము.

### 1-వ రంగము—అరణ్యము.

(విదూషకుఁడు, మాద్రి ప్రవేశించుచున్నారు.)

విదూ—మాద్రీ! మనకు సమయము రాఁగలదు. ఓర్చుకొనుము మాద్రీ!

మాద్రి—ఆవృద్ధుఁ డెన్నిమాటలు చెప్పినను, యాజకుఁడు పూర్తిగఁ దగినవాఁడే!

విదూ—మాద్రీ! ఆకొండు కడుఁ గొంటెవాఁడు. పరమనీచ మైనభట్టు. అయిన నేమి గాని మాద్రీ! యీయరణ్యమున నొకయువకుఁడు నీ వాతని సొత్తని చాటుచున్నాఁడు.

మాద్రి—వాఁ డెవ్వఁడో నాకుఁ దెలియును. ఈప్రపంచమున నాతో వాని కేమియు సంబంధము లేదు. అదె యాతఁ డిచ్చటికే వచ్చుచున్నాఁడు.

విదూ—జానపదునిఁ జూచుట నాకాహారమును, బానీయమును. మంచిచమత్కారముగల మనము విశేషముగా సమాధానము చెప్పవలసియుండును. మనము వెక్కిరించుచుందుము. మానమును వహింపలేము.

(వివృతాస్యుఁడు ప్రవేశించుచున్నాఁడు)

వివృ—మాద్రీ! నీకు శోభన మగుఁగాక!

మాద్రి—వివృతాస్యుఁడా! దేవుఁడు నీకును శోభనమును గలిగించునుగాక!

వివృ—(విదూషకు నుద్దేశించి) మీకును శోభన మగునుగాక!

విదూ—స్నేహితుఁడా! నీకును శోభనమగును గాక! శిరోవేష్టనమును ధరింపుము. శిరోవేష్టనమును ధరింపుము. నిన్ను బతిమాలుకొందును. పాగా పెట్టుకొనుము. మిత్రుఁడా! నీప్రాయ మెంత?

విప్ర—ఇరువదియైదు.

విదూ—పూర్ణవయస్సే. నీపేరు విప్రుతాస్యుఁడా?

విప్ర—అయ్యా! విప్రుతాస్యుఁడే.

విదూ—మంచి సొగసైనపేరు. నీవీయరణ్యముననే పుట్టితివా?

విప్ర—అవునయ్యా! అందునకు నేను దేవునిస్తుతించెదను.

విదూ—దేవుని స్తుతించుట మంచిసమాధానమే. ధనికుఁడవేనా?

విప్ర—ఎంతలెండు.

విదూ—ఎంతలెండు, మంచిది. మిక్కిలి మంచిది, మఱియు మంచిది. అయినను మంచిదిగాదు. ఎంతలెం డంతటిదేగదా! నీవు బుద్ధిమంతుఁడవేనా?

విప్ర—అవునయ్యా! నాకు మంచిచాతుర్యము గలదు.

విదూ—ఏమి! నీవు చక్కఁగాఁ జెప్పుచుంటివి పూర్వపుసంగతి జ్ఞప్తికి వచ్చుచున్నది.

క. ఉర్వి న్మతిహీనుఁడు దా
సర్వజ్ఞుఁడ ననుచు దర్పసముపేతుఁడగున్
సర్వజ్ఞుఁడైన విబుధుఁడు
గర్వితనతి గాక మూర్ఖుఁగాఁ దలఁచుఁదనున్. 77

నాస్తికుఁడైన తత్త్వజ్ఞుఁ డొకఁడు ద్రాక్షపండుఁ దినఁ గుతూహలుఁడై పెదవులఁ దెఱచి ద్రాక్షపండు నోట వైచుకొని, పండు, తినుటకుఁ బుట్టినదనియుఁ, బెదవులు, తెఱచుటకుఁ బుట్టినవనియుఁ దలంచెను. నీవీ కన్యకం బ్రేమించితివా?

విప్ర—అయ్యా! అట్లే.



విదూ—అట్లయిన నీచేయి నా కిమ్ము. నీవు విద్వాంసుఁడవేనా?

విప్ర—అయ్యా! కాను.

విదూ—అట్లయిన నావలన దీనిని నేర్చుకొనుము—కలిగియుండుట కలిగియుండుటే. మద్యము నొకపాత్రనుండి మఱియొకపాత్రలోనికిఁ బోసినయెడల నొకపాత్రనింపుటచే రెండవది శూన్య మగుననునదియే యలంకారశాస్త్రమున నొకసుప్రసిద్ధాలంకారము. 'వానియంతటివాఁడు వాఁడే'' యని గ్రంథకర్త లందఱు నొప్పుకొనిరి. నీవు వాఁడవుకావు. నేను వాఁడను.

విప్ర—వాఁ డెవఁడయ్యా!

విదూ—ఈపిల్లను బెండ్లిచేసికొనవలసినవాఁడే. కావున నోరీ! జానపదుఁడా! పరిత్యజింపుము—నీవంటినీచుల కిట్టిమాట యర్థముకాదు. విడిచిపెట్టుము—సాంగత్యము—ఇది యడవిమనుష్యులభాషలోఁ గలయిక—ఈమత్తకాశిని యొక్క—ఇదిసాధారణభాషలో నాఁడుది. ఇవి యన్నియుఁ గలిపిచెప్పినయెడల నిట్లగును. ఈమత్తకాశినియొక్క సాంగత్యము పరిత్యజింపుము. లేనియెడల నోవనచరుఁడా! నీవు నిహతుఁడ వయ్యెదవు. నీకు బాగుగాఁ దెలియుకొఱకు—చచ్చెదవు. అనఁగా—నేనునిన్నుఁ జంపెదను, మాయముచేసెదను, నీజీవమును మరణముగా మార్చెదను, నీస్వేచ్ఛను సేవకవృత్తిగా మార్చెదను, విషముఁ బెట్టెదను, నీబుఱ్ఱఁ బగులఁగొట్టెదను, నిన్నుఁ గత్తితోఁ బొడిచెదను, నీపయిని బుగజములఁ బురికొల్పి కుట్రఁ జేసెదను, కుతంత్రములచే నిన్నుఁ బడఁగూల్చెదను, నూటయేఁబదిరీతులచే నిన్నుఁ బరిమార్చెదను గావున గజగజవడంకుము. పాఱిపొమ్ము.

మాద్రి—యోగ్యుఁడ వయినవిప్రుతాస్యుఁడా! అట్లులే చేయుము.

విప్ర—అయ్యా! దేవుఁడు నీకు సంతోషమును గలిగించునుగాక! (విప్రుతాస్యుఁడు నిష్క్రమించును)

అంగదు—(ప్రవేశించి) మనదొరలు నీకై వెదకుచున్నారు. వేగిరమున రమ్ము, వేగిరమున రమ్ము.

విదూ—మాద్రీ! పరుగిడుము. నేను వచ్చుచున్నాను, వచ్చుచున్నాను. అందఱు నిష్క్రమింతురు)

## 2-వ రంగము—అరణ్యము.

(భీమబలుఁడు, ప్రద్యుమ్నుఁడు ప్రవేశించుచున్నారు)

భీమ—నీ విం తస్వల్పపరిచయముచేతనే యామెయందు సదభిప్రాయమును బొందుట సాధ్య మగునా? చూచినంతమాత్రముననే మోహించుట మోహించినంతమాత్రముననే యామె ననుసరించుట, యనుసరించినంతమాత్రముననే యామె యంగీకరించుటయుఁ గూడ జరిగెనా? నీ వామెను బరిగ్రహించుటకు నిశ్చితమనస్కుఁడ వై యుంటివా?

ప్రద్యు—గీ. నాదునవివేకమును నా మెపేదతనము
స్వల్పమైత్రియు సాహసికానుసరణ
కేళియును నామె సాహసాంగీకృతియును
నీవు వేనినిగూర్చి ప్రశ్నింపవలదు. 78

నేను గమలను బ్రేమించుచుంటి ననుటలో నాతో నేకీభవింపుము. ఆమె నన్నుఁ బ్రేమించితి ననుటలో నామెతో నేకీభవింపుము. పరస్పరోపభోగములను మేమందుటకు నీవంగీకరింపుము. దానివలన నీకు మేలు గలుగునుగాక! ఏలయన, నాజనకుఁ డగువిజయభూపతియొక్క సర్వాదాయమును నీయధీనపఱచి నే నిక్కడ గోపకుఁడనై జీవయాత్ర గడపుదును.

భీమ—సమ్మతిని నీవు వడసితివి. రేపే నీయుద్వాహము జరుగఁగలదు. నీ వివాహమునకు రాజును బరితృప్తులైన తత్సేవకుల నాహ్వానమును జేసెదను. నీవు వెళ్లి కమలను సిద్ధపఱచుకొనుము. ఇదె నాచారుమతి యిటు వచ్చుచున్నది.



చారు—(ప్రద్యుమ్ను నుద్దేశించి) సోదరుఁడా! దైవము నిన్ను రక్షించును గాక!

ప్రద్యు—అక్కా నిన్నుఁగూడ.

(ప్రద్యుమ్నుఁడు నిష్క్రమించును)

చారు—ఓ ప్రియా! భీమబలా! నీహృదయము నుత్తరీయమున బంధించికొనుటఁ జూడ నాకు మిక్కిలి విచారకరముగా నున్నది.

భీమ—బంధింపఁబడినది నానుండేయి.

చారు—నీహృదయము సింహనఖరములచే గాయముచేయఁబడిన దని తలంచెదను.

భీమ—గాయపఱుపఁబడె ననుమాట సత్యమే. అది యొకయువతీలలామకటాక్షసాయకములచే—

చారు—రక్తసిక్త మగునీయుత్తరీయమును గనఁబఱచినపుడు నే నెట్టుల మూర్ఛనటించితినో నీసోదరుఁడు నీకుఁ దెల్పెనా?

భీమ—అంతియే గాదు. అంతకన్న మహాద్భుతములం దెల్పెను.

చారు—ఓహో! నీవు చెప్పుచున్న సంగతి నాకుఁ దెలియునులే, నిశ్చయముగా నది సత్యమే. యుద్ధసన్నద్ధము లయిన రెండుపొట్టేళ్లయొక్క సమావేశము కంటెను, "వచ్చితిని—చూచితిని—జయించితిని" అని ప్రగల్భములాడు రారాజు దాంభికములకంటెను నాకస్మికములు లేవుగదా! నీసోదరియు, సోదరుఁడును—

సీ. విపినభూమిని సమావేశ మొందినతోడ
సారిది నొండొరులను జూచుకొనిరి
చూచి నిర్వ్యాజపాటు చూపు నొండొరులపై
మించుకొన్నట్టి తోడ మేలుపడిరి

మేల్పడి మోహంబు నిల్పఁజాలక పర
స్పరము నిట్టూర్పుల భరముఁగొనిరి
నిట్టూర్పులూర్చి నిర్ణిద్రవైఖరుల న
న్యోన్యకారణముల నరసికొనిరి
గీ. అరసికొని కారణంబున కర్హమైన
ఘనచికిత్సను గావించుకొనిగి యిట్టు
భూమికలతోడఁ గల్యాణభూరిమండ
పంబున కమర్చి రిద్ధసోపానములను. 79

వీరంతమాత్రము నాలసింపక కల్యాణమండపము నధిష్ఠించెదరు. వీరు మోహోద్రేక మనుజ్వలనజ్వాలచేఁ బరితపింపఁబడుచుండిరి. ఏమయినను, వారిరువురు నేకీభవించెదరు. గదాఘాతములయిన వారిని విఘటింపఁ జాలవు.

భీమ—రేపు వారి యుద్వాహము కాఁగలదు. వారిశోభనమునకు మనభూపాలునిఁ బరివారము నాహ్వానించెదను. కాని, అయ్యో! సౌఖ్యమును బరుల నేత్రములతోఁ జూచుట యెంతదుస్సహముగా నుండును. రేపు తనవాంఛితార్థము లభించినందునకు నాసోదరుఁ డెంతసంతోషముతో నుండెనో నేనంత వలవంతతో నుండెదను.

చారు—అట్లయిన రేపు నీకు నేఁ జారుమతిఁగా నటింపను.

భీమ—నేనింకఁగల్పనామాత్రమున జీవింపఁగలను.

చారు—ఇంతటినుండి నిన్ను వ్యర్థప్రసంగములచే విసిగింపను. నే నిప్పుడు కొంతకారణముతో మాటలాడుచుంటిఁ గావున నేను జెప్పునది గ్రహింపుము. నీవు కొంతజ్ఞానము కలిగిన యోగ్యుఁడ వని నేనెఱుంగుదును. ఇది నేను బుద్ధిమంతుఁడ ననిపించుకొనుటకై నిన్ను బుద్ధిమంతుఁడ వని చెప్పుటలేదు. నావాక్యమును నిన్ను నమ్మించుటకొఱకు నేను జేయు ప్రయత్నము నీమేలుకొఱకే కాని మాగౌరవముకొఱకుఁ గాదు. కాన



నీకిష్టమైనచో నేనద్భుతకార్యములను నిర్వహింపఁగల నని నీవు నమ్ముము. నేను మూఁడేండ్లప్రాయమునాఁటనుండియు నొకయైంద్రజాలికునితో సఖ్యముఁ జేసికొంటిని. అతఁ డావిద్యయందుఁ బరిపూర్ణుఁ డయ్యును దుష్ప్రవర్తనకలవాఁడు కాఁడు. నీవు బయటికి వెలువరించు చారుమతియందలి గాఢానురాగము మనంబునఁ గూడ నిరూఢమైనయెడల నీసహోదరుఁడు కమలం బెండ్లియాడునపుడు నీవు గూడ నీచారుమతిం బెండ్లియాడఁగలవు. ఆమె యిప్పు డెంతదుస్థితిలో నున్నదో నే నెఱుంగుదును. నీకేమియు నభ్యంతరము లేనియెడల నామెను నిరపాయముగ సహజరూపముతో రేపు నీకుఁ బ్రత్యక్షపఱుచుట నాకసాధ్యములోనిది కాదు.

భీమ—నీవు తెలివిగలిగియే మాట్లాడుచుంటివా?

చారు—అట్లేయని నాప్రాణము నొడ్డెదను. నేనైంద్రజాలికుండ నని చెప్పుకొనుచుండినను బ్రియముతో నాప్రాణంబు నొప్పింతును. కావున నీవు విలువగల దుస్తులను ధరించుకొనుము. నీమిత్రుల నంపఱ నాహ్వానించుకొనుము. ఇష్టమగునేని రేపు నీకు వివాహము కాఁగలదు. మఱియు నిష్టమగునేని నీచారుమతికే కాఁగలను. అదె నిన్నుఁ బ్రేమించిన స్త్రీయును, నామె ప్రియుఁడును వచ్చుచున్నారు. చూడుము. (కలహాశీలయు, భద్రుఁడుఁ బ్రవేశించుచున్నారు.)

కలహా—(చారుమతి నుద్దేశించి) యువకుఁడా! నాజాబు నీతనికిఁ గనఁబఱచి నాయెడల నపచారమును గావించితివి.

చారు—అయిన నేమిలే. నేను దానిని బరిగణింపను. నీయెడల నైచ్యమును, అపచారముఁ బచరించుమార్గము నన్వేషించుటయే నావిద్యాభ్యాసము. నీవెనువెంట నేతెంచిన గోపాలకుఁడు కడు విశ్వాసవంతుఁడు. వాని వంకఁ జూడుము. వానిం బ్రేమింపుము. వాఁడు నిన్నుఁ బూజించుచున్నాఁడు.

కల—(భద్రు నుద్దేశించి) యోగ్యుఁడ వగుగోపకుఁడా! ప్రేమించుట యన నెట్టిదియో యీయువకునకుం దెలియఁ జెప్పుము.

భద్రు—అది యెంతయు నిట్టూర్పులతోడను, గన్నీళ్లతోడను నిండియుండును. నేను గలహాశీలవిషయమై యిట్లే యనుసరించుచుంటిని.

కల—వసంతునివిషయమున నేను నట్లే.

భీమ—చారుమతివిషయమున నేను నట్లే.

చారు—నే నేస్త్రీవిషయమున నిట్లుగాదు.

భద్రు—అది యెంతయు విశ్వాసముతోడను, సేవతోడను గూడియుండును. కలహాశీలవిషయమున నే నట్లే యనుసరింతును.

కల—వసంతునివిషయమున నేను నట్లే.

చారు—నే నేస్త్రీవిషయమున నట్లుగాదు.

భద్రు—ఇది యంతయు భావనతోడను, వికారముతోడను, బరిశోధనతోడను, వినయముతోడను, నోర్పుతోడను, నసహనముతోడను, బరిశుద్ధతతోడను, బ్రయత్నముతోడను, నన్వేషణముతోడను నిండియున్నది. కలహాశీలవిషయమున నే నట్లే.

కల—వసంతునివిషయమున నేను నట్లే.

భీమ—చారుమతివిషయమున నేను నట్లే.

చారు—ఏస్త్రీవిషయమున నే నట్లుకాదు.

కల—(చారుమతి నుద్దేశించి) అట్లయిన నిన్నుఁ బ్రేమించినందుకు నన్నేల నిందించెదవు?

భద్రు—(కలహాశీల నుద్దేశించి) అట్లయిన నిన్నుఁ బ్రేమించినందుకు నన్నేల నిందించెదవు?

చారు—(భీమబలు నుద్దేశించి) "నిన్నుఁ బ్రేమించినందుకు నన్నేల నిందించెదవు" అని నీవెవ్వరితో మాట్లాడుచుంటివి?



భీమ—ఇచ్చట లేనిదానితోడను, నాముచ్చట నాలింపనిదానితోడను.

చారు—దయచేసి యీప్రసంగము నింతటఁ గట్టిపెట్టుము. ఈప్రసంగము చంద్రునివంకఁ జూచుచు జంబుకము లఱచునట్లున్నది. (భద్రు నుద్దేశించి) నాకు సాధ్య మగునేని నీకు సహాయపడెదను. (కలహాశీల నుద్దేశించి) నాకుఁ బరమగునేని నిన్నుఁ బ్రేమించెదను. మీరందఱును గలిసి రేపు నాయొద్ద కరుదెండు. నే నెన్నఁడయినను స్త్రీని బరిగ్రహించునెడల నిన్నే పరిగ్రహించెదను. రేపు నాకుఁ దప్పక వివాహము కాఁగలదు. (భీమబలు నుద్దేశించి) నే నెప్పుడయినఁ బురుషుని దృప్తిపఱచునెడల నిన్నే తృప్తిపఱిచెదను. రేపు నీకు వివాహము కాఁగలదు. (భద్రు నుద్దేశించి) నీకు హితమైనది నిన్నుఁ దృప్తిపఱచునెడల నేను నిన్నుఁ దృప్తిపఱిచెదను. రేపు నీకుఁ బెండ్లి కాఁగలదు. (భీమబలు నుద్దేశించి) నీవు చారుమతిని బ్రేమించుచుంటివి గాన నామెను గలిసికొనుము. భద్రు నుద్దేశించి) నీవు కలహాశీలను బ్రేమించితివి గావునఁ గలిసికొనుము. నే నేస్త్రీని బ్రేమింపలేదు గావున నేనును గలిసికొందును. మీకందఱకును శుభమగుంగాక! మీకందఱకు గమనింపవలసిన యాజ్ఞలను వెలువఱిచితిని.

భద్రు—జీవించియున్నయెడల నేను దప్పను.

కల—నేనును.

భీమ—నేనును.

(అందఱు నిష్క్రమింతురు.)

## 3 వ రంగము – అరణ్యము.

(విదూషకుఁడు, మాద్రియుఁ బ్రవేశించుచున్నారు)

విదూ—మాద్రీ! రేపు కడుసుదినము. రేపు మనకుఁ బెండ్లి కాఁగలదు.

మాద్రి—నాసంపూర్ణహృదయముతో నట్లే కోరుచున్నాను. యువతీజన

సామాన్య మగువైవాహికాపేక్షవలన నామర్యాదకు భంగము లేదుగదా? రాజ్యభ్రష్టుఁడైన భూపాలుని పరిచారకు లిరువురు నిదె వచ్చుచున్నారు.

(ఇద్దఱు పరిచారకులు ప్రవేశింతురు)

ప్రథముఁడు—యోగ్యుఁడా! చక్కఁగాఁ గలిసికొంటిమి.

విదూ—నిశ్చయముగఁ జక్కఁగనే కలిసికొంటిమి. రమ్ము. రమ్ము. కూర్చుండుము. ఏదీ యొక పాటఁ బాడుము.

ద్వితీయుఁడు—మేము మీయధీనులమే గదా! మానదుమఁ గూర్చుండుము.

ప్రథ—హీనమయిన కంఠస్వరము గలవారివలె దగ్గుట, సకిలించుట, యెలుఁగు రాచిన దని చెప్పుట మొదలగు నుపచారవాక్యములఁ గట్టిపెట్టి నూటిగా గానమునఁ బ్రవేశింతము.

ద్వితీ—తప్పక తప్పక. ఇద్ద ఱెఱుకలవాం డ్రొక గాడిద నెక్కినట్లు మన మిద్దఱముఁ దప్పక శ్రుతి గలిపి పాడుదము.

ఉత్సాహ. కోరియుంగరముల మార్చుకొనఁగనొప్పుకాలముం
గూరిమిగను బత్తులెల్లఁ గోకొయనెడికాలముం
జేరి కాముకులు సెలంగ సేసలెత్తుకాలమున్
మీఱె యీవసంతమెంత మేలుకొల్పె మేలమున్. ౮౦

2. పచ్చనివరిచేలనుండి పాడుకొనుచుఁ బోవువా
రిచ్చగించుకాముకుఁడును నితని ప్రేయసియును గా
హెచ్చుజొన్నచేలయందు హీహియనుచుఁ బల్లెలన్
వచ్చు నంపమైన ప్రజలు పండుకొనుచునుండ్రుగా. ౮౧

3. ఈవసంతకాలమహిమ నెంతయేని జూడఁగా
జీవితంబు సుమసమనుని చెప్పి చూపుచుండెఁగా
యౌవనంబు ప్రేమతోడ హత్తి భూమిపతియుగుం
గావునసె హాహాయటంచుఁ గలిసిపాడఁగాఁదగున్. ౮౨



విదూ—ఆహా! యౌవనపురుషులారా! ఈగీతమున విషయమేమియు లేకపోయి నను సంగీతము మిక్కిలివికారముగా నున్నది.

ప్రథ—అయ్యా! మీరు మోసపోయితిరి. కాలగతిని దప్పకయే నడిపించితిమి.

విదూ—నిశ్చయముగా నట్లే. ఇట్టియసహ్యాకర మగుపాట వినుటచే నాకాలగతిని వ్యర్థముగాఁ బరిగణించుచుంటిని. భగవంతుఁడు మీకు సహాయుఁడై మీకంఠములం జక్కఁబఱుచునుగాక! మాద్రీ! పోవుదము రమ్ము.

(అందఱు నిష్క్రమించుచున్నారు)

## 4-వ రంగము—అరణ్యము.

(సింహకేతుఁడు, అనంతుఁడు, ప్రియంవదుఁడు, భీమబలుఁడు, ప్రద్యుమ్నుఁడు, కమల ప్రవేశించుచున్నారు)

సింహ—భీమబలుఁడా! ఆబాలుఁడు తనచెప్పినవన్నియు నెఱవేర్పఁగలఁడని నీవు నమ్మెదవా?

భీమ—ఫలనిశ్చయము లేనివారు తమసంశయమును గుర్తించుచుండియు నొకప్పుడు ఫలాపేక్ష నందుచుందురు. అట్లే నే నొకప్పుడు నమ్ముచుందును, ఒకప్పుడు నమ్మకుందును.

(చారుమతి, కలహాశీల, భద్రుఁడు ప్రవేశింతురు)

చారు—ఇప్పుడు మనసమయములను సిద్ధాంతపఱుచుకొనువఱకును సద్దుసేయక కొంచె మోపికపట్టి యుండుము. (రాజునుద్దేశించి) నేను మీచారుమతిని దీసికొనివచ్చినయెడల భీమబలున కిచ్చి వివాహము చేయుటకు మీ రంగీకరించితిరి గదా!

సింహ — ఆమె కరణమిచ్చుటకు రాజ్యములుండినను, నట్లు చేయుదును.

చారు — (భీమబలు నుద్దేశించి) నే నామెం దీసికొనివచ్చినప్పుడు వివాహము చేసికొనుటకు నీవు సమ్మతించితివి గదా!

భీమ — నేను లోకమున కంతకు రాజునైనను నట్లే చేసెదను.

చారు — (కలహాశీల నుద్దేశించి) నేనిష్టపడినయెడల నన్ను వివాహమాడెద నంటివిగదా!

కల — వివాహ మయినయొకగంటకే మరణింపవలసివచ్చినను నే నట్లొనర్చెదను

చారు — నీనోట నీవు నన్ను వలవని తిరస్కరించు నెడల నీయందుఁ గడువిశ్వాసము గల యీగోపకుని బెండ్లిచేసికొందువా?

కల — ఈవిధముగానే మనబేరములు నిర్ణయించుకొందము.

చారు — (భద్రు నుద్దేశించి) ఈకలహాశీల నిన్నంగీకరించెనేని వివాహమాడుటకు సిద్ధుఁడవై యుంటివిగదా!

భద్రు — దానిఁ జేర్చుకొనుట మృత్యుసామీప్యమువంటి దైనను సమ్మతించెదను.

చారు — ఈవ్యవహారము లన్నిటిని జక్కఁబెట్టుటకు నేను వాగ్దానము చేసితిని. ఓరాజా! నీకూఁతును భీమబలున కిచ్చెద నని చేసినశపథము నిలుపుకొనుము. భీమబలుఁడా! నీవు నట్లే యీరాజపుత్త్రిక నంగీకరించెద నని చేసినశపథము నిలిపికొనుము. కలహాశీలా! నీవు నన్నుఁ బెండ్లియాడెద ననియు నందున కిచ్చగింపవేని యీగోపకుని బెండ్లియాడుదు ననియుఁ జెప్పుకొనిన నీ మాట నిలిపికొనుము. భద్రుఁడా! అది నిన్నుఁ విసర్జించిన నీవు దానిని బెండ్లియాడెద ననిన మాట నిలిపికొనుము. ఈసందేహము లన్నిటిని నివర్తింపుటకు నేనిచ్చటనుండి వెడలిపోయెదను.

(చారుమతీ కమలలు నిష్క్రమించుచున్నారు)

సింహ — ఈబాలగోపకుని ముఖమునందు నాకుమార్తయొక్క లక్షణంబులు కనిపించుచున్నట్లు తోఁచుచున్నది.



భీమ — ఓనాయేలికా! ఈతని నేను మొదటఁ జూచినపుడు నీకుమార్తకు సోదరుఁ డని యనుకొంటిని. అయినను, నీతఁ డీయరణ్యముననే పుట్టి పెరిగినవాఁడట. వీనిపినతండ్రి కొంతకాలము నగరవాసియై యీతని కనేకములయిన ముక్తిమార్గావరోధములగు, కుతంత్రములఁ బెక్కుల నేర్పెనఁట. ఈయరణ్యమధ్యమున డాఁగియుండిన గొప్ప యైంద్రజాలికుఁ డని చెప్పెను.

(విదూషకుఁడును, మాద్రియుఁ బ్రవేశించుచున్నారు)

ప్రియం — అదిగో నిశ్చయముగ మఱియొక ప్రళయప్రవాహము ముందు వచ్చుచున్నది. ఈప్రవాహమునుండి యుద్ధరింపఁబడుటకై యీమిథునసింహము నావ నధిష్ఠింప నేతెంచుచున్నది. ఒకవిచిత్రమృగముల జంట యిట్లైవచ్చుచున్నది. దీనిని సర్వభాషలయందును, వి—దూషకనామమునం బిలిచెదరు.

విదూ — మీ కందఱకు నమస్కారములు, స్వాగతములు నర్పించుచున్నాను.

ప్రియం — యోగ్యుఁడవైన మాయేలికా! ఈతనికి స్వాగత మొసంగుఁడు. నే నీయరణ్యమునఁ బెక్కుసారులు కలిసికొనిన విదూషకస్వభావుఁ డితఁడే! ఈతఁ డొకప్పు డొకయాస్థానమున నుంటి నని ప్రమాణముచేయుచున్నాఁడు.

విదూ — నన్నెవఁడయినను సంశయించినయెడల నాచే ఘోరప్రమాణము చేయించి నిజమును దెల్పవలయును. నేను మున్ను కొంతకాలము రాజాస్థానములయందు నాట్యము చేసినవాఁడనే. నేను నొకస్త్రీని గొనియాడినవాఁడనే. నేను నామిత్త్రులతోఁ దంత్రముల నెఱపితిని. నావిరోధితోఁ గూడ నట్లె యొనర్చితిని. ముగ్గురు కుట్టుపనివాండ్రను భ్రష్టులఁ జేసితిని.

ప్రియం — అది తుదకెట్లు పరిసమాప్తిఁ జెందినది?

విదూ—మేము పురమును దలపడినపిదప నేడవకారణమువలన గుర్తించితిమి.

ప్రియం—ఏడవకారణ మెట్లయినది? ఏలికా! మీరీతనిం గాంచి సంతసించుచుంటిరా?

రాజు—నే నీతఁడు మంచివాఁడనియే తలంచుచుంటిని.

విదూ—అయ్యా! భగవంతుఁడు మీకొసంగునుగాక! నేనును మిమ్ముల నట్లె తలంచుచుంటిని. ఈయాటవికదంపతుల నంపజ నోసరించుకొని తమసన్నిధానమునకు వైవాహిక ప్రమాణములు తమయొద్దస్థిరపఱచుటకును శరీరేచ్ఛలు ప్రమాణములకు వ్యతిరిక్తములయినయెడల భంగపఱుచుటకును గోరివచ్చితిని. అయ్యా! ఒకపేదకన్నెక; చూచుటకరమ్యమైనది. అయిన నిది నాహక్కు. దీని నిం కొకఁడు వరింపకుండుటయే నావెఱ్ఱితలఁపు.

చ. తమదగు కంఠహారమునఁ దార్కొనుముత్య మొకప్డు హేయగం
ధముగల కీటగర్భమునఁ బద్దయు వాసముఁ జేసినట్లు మా
ల్యము వచియింపరాని సముదారసుశీలత లోభిపోలె గా
ఢముగను నీకురూపిణియెడ న్వసియించె విచిత్రవైఖరిక్. ౬౩

సింహ—నిశ్చయముగా నీతఁడు సమయస్ఫూర్తితో గంభీరమయిన నీతుల నుద్బోధించువాఁడు.

విదూ—విదూషకుఁడు వాచాలుఁ డని వానిమాటల నెవ్వరు విశ్వసింపరు.

ప్రియం—ఏడవకారణము సంగతి యేమి? ఏడవకారణముమీఁద నీతగవు నెట్లు కాంచితివి?

విదూ—ఏడు మెట్లెక్కినయసత్యముమీఁద. మాద్రీ! నీవస్త్రమును సవరించుకొని చక్కఁగా నిలువఁబడుము. అయ్యా! ఒకసభ్యుఁడు తనగడ్డము నెగుడుదిగుడుగాఁ గత్తిరించుకొనఁజూచి నే నసహ్యించుకొంటిని. అప్పుడు వాఁడు నాగడ్డము నీదృష్టి కెగుడుదిగుడుగాఁ గాన్పించినను నాకు బాగుగనే యున్న దని వార్తనంపెను. దీని నే సభ్యసమాధాన మందురు. తిరిగి సరిగాఁ గత్తిరింపఁబడలేదని నేను దెలియఁబఱచినయెడల నాయిష్టము ననుసరించి కత్తిరించుకొంటి నని ప్రత్యుత్తర మిచ్చును. దీని నే తీక్ష్ణపరిహాస మందురు. తిరిగి, చెడుకత్తిరింపే యందునా యావిషయమున నీవు బుద్ధిహీనుఁడవని చెప్పును. దీని నే పౌరుషప్రసంగ మందురు. రెండియుఁ జెడుకత్తిరింపనిన నది సత్యము కాదనును. దీని నే సాహసప్రత్యుత్తర మందురు. తిరిగి చెడుకత్తిరింపే యనినచో నీవసత్యవంతుఁడ వనును. దీని నే నిరుత్తరవాదమందురు. అనిరూపితాసత్యము, ఆపై నిరూఢాసత్యము.



ప్రియం—నీవు వానిగడ్డము సరిగాఁ గత్తిరింపఁబడలే దని యెన్నిసారులు పలికితివి?

విదూ—నే నాఱవ మెట్టు నతిక్రమింపఁ జాలకపోయితిని. ఆతఁడు నాపై నిరూఢాసత్యము నారోపింప లేకపోయెను. అంతట వాగ్బాణముల నుపసంహరించుకొని పరాఙ్ముఖుల మైతిమి.

ప్రియం—నీ విప్పు డాయసత్యములను వరుసగాఁ బేరుపెట్టి చెప్పఁగలవా?

విదూ—అహా! నిస్సంశయముగా, మీగ్రంథములనుండి సద్విషయములను నేర్చుకొనినట్లె మేమును మావికటవివాదగ్రంథములయం దేర్పఱచిన విధుల నతిక్రమింపక కలహశీలతను శాస్త్రోక్తముగా నడపెదము. ఆ మెట్లు చెప్పెదను వినుము. (1) సభ్యసమాధానము, (2) తీక్ష్ణపరిహాసము, (3) పౌరుషప్రసంగము, (4) సాహసప్రత్యుత్తరము, (5) నిరుత్తరవాదము, (6) నిరూపితాసత్యము, (7) నిరూఢాసత్యము. నిరూఢాసత్యముం దప్పఁ దక్కిన యాఱింటిని దప్పించుకొనవచ్చును. "కనుక" ననుపదప్రయోగముచే నిరూఢాసత్యముయొక్క బారినుండి తప్పించుకొనవచ్చును. మున్నొకప్పు డేడుగురు న్యాయాధికారు లేకకాలమునం జేరి యొకతగవుం దీర్పలేకపోయిరి. వాదిప్రతివాదులు తారసిల్లినపు డందొకనికి "కనుక" జ్ఞాపకము వచ్చి, నీవట్లంటివి గనుక నే నిట్లంటి ననియె. అంతట వారుభయులు

వివాహమువూని యొకరి నొకరు కౌఁగిలించుకొని సోదరభావము నొందుటకుఁ బ్రమాణములు చేసికొనిరి. "కనుక" యే సమాధానకర్త. "కనుక" యందు మిక్కుటమగు మాహాత్మ్యము కలదు.

ప్రియం—ఏలికా! ఈతఁడు విచిత్రమైన మనుష్యుఁడు కాఁడా! ఈతఁడు ప్రతికార్యమున కర్తుఁడు, విదూషకుఁడు నగుచుండును.

సింహ—చం. పులుఁగులవేఁటకాఁ డొకసమున్నతమౌ వృషభంబుమాటుగా
నిలిపి సమీపమొంది శకునిప్రకరంబులఁ గొట్టుపోల్కి నిం
దులకు విదూషకత్వమును దోడ్కొని యీతఁడు లోకదుష్టచే
ష్టలఁ దనవాక్యబాణముల సారెకు స్వేచ్ఛగఁ గొట్టసాగెడున్. 84

(కామదేవత, చారుమతీకనులల నిరుప్రక్కలనిడుకొని చేతులుపట్టుకొని పాడుచుఁ బ్రవేశించును).

కామ—ఉత్సాహ.

జగమునందు జనులు కలఁత జాలి తాపమొంది యుం
డగవులెల్ల పీడుకొనిన తత్క్షణంబె దివమునం
దగినవిబుధులెల్ల సంతతంబు ముదముఁ గందురో
జగతినాథ! నీకుమూర్తి స్వర్గపురమునుండి తా
దిగియెఁ గామదేవి యిపుడు తీసికొనుచువచ్చెఁ గా
మగువమనమునందుఁగల్గుమగనికిచ్చియీ మెకుఁ
సొగసుగా వివాహ మిపుడు సొంపుమీఱఁ జేయుమా. 85

చారు—(రాజునుద్దేశించి) నేను నీదానను గనుక నన్ను నీకు సమర్పించుకొనుచుంటిని. (భీమబలు నుద్దేశించి) నేను నీదానను గనుక నన్ను నీకు సమర్పించుకొనుచున్నాను.

సింహ—నాదృష్టులుసత్యవంతము లైనయెడల నీవు నాకుఁ బుత్రికవే.



భీమ—నాదృష్టులు సత్యవంతము లైనయెడల నీవు నాచారుమతివే.

కల—దృష్టియు, నాకృతియు సత్యమైనయెడల నీప్రేమ కొకనమస్కారము.

చారు—(రాజునుద్దేశించి) నీవాతఁడవే కానియెడల నాకుఁ దండ్రియే యనవసరము. (భీమబలు నుద్దేశించి) నీ వాతఁడవే కానియెడల నాకు భర్తయే యనవసరము. (కలహాశీల నుద్దేశించి) నీవామెవే కానియెడల నేను స్త్రీ నెన్నఁడును వివాహముచేసికొనను.

కామ—ఓహో! మీ రెవరును సద్దుసేయకుఁడు. ఇచ్చట జరుగుచుండు నద్భుతాంశములయొక్కసారము విపులపఱిచి తృప్తికరమయిన పరిసమాప్తిం జెప్పవలసియున్నది.

గీ. ఉర్వి సత్యంబునకు సత్య మున్నయెడలఁ
గామదేవతయొక్క సంఘంబులోనఁ
జేరఁ బాణిగ్రహణలీలఁ గోరువారు
మనసమూహంబులో నెనమండ్రు గలరు. 86

నేనువివాహమంగళగీతమును బాడుచుండెదను. మీ రెవరెవ రెచ్చటఁ జెరిగి యేరీతిఁ గలసికొంటిరో యందలియాశ్చర్యములను బరస్పరసంభాషణమూలన నివారించుకొనుఁడు. (చారుమతీ భీమబలులతో)

గీ. ఎట్టియిక్కట్టులును మిమ్ము నెడపలేవు
(కమ—తో)
మదిని మది హత్తినట్లు లుండెదరు మీరు
(కల—తో)
ఈవు భద్రుని గొనుము లే దేని యొక్క
నాతి చెంగట దాస్యం బొనర్పవలయు
(మాద్రి—విదూ—తో)
శీతకాలంబుఁ జలియును జేరినట్లు
మీరలేకీభవించియున్నారు గాదె. 87

సింహ—(కమల నుద్దేశించి) ప్రియ మైనసోదరపుత్త్రీ! నాపుత్త్రికతో సమానముగ నీకు స్వాగత మిచ్చుచున్నాను.

కల—(భద్రు నుద్దేశించి) నే నాడినమాటను భంగపఱుపను. నీవు నాకు నాథుఁడ వైతివి. నీకు నాయెడలఁ గల్గువిశ్వాసమును, నాచాపల్యమును, నిప్పుడు గలిసికొనినవి. (పటాక్షేపముగ సౌమ్యుఁడు ప్రవేశించుచున్నాఁడు).

సౌమ్య—నేను బల్కునొక రెండుమాటలను వినుటకు నాకవకాశమును దయచేయవలె నని ప్రార్థించుచున్నాను. ఈసుందర మైనబృందమునకు శుభోదంతమును దీసికొని వచ్చిననేను విజయభూపతియొక్క మధ్యమపుత్త్రుఁడను.

గీ. సతులఁ బతులను భోజనశయనగతులఁ
బాయఁ జేయునియుద్వాహబంధ మనఁగ
దారకుఁ గిరీటతుల్య ముద్దామగరిమఁ
గామదేవత భువిఁ బ్రతిగ్రామమునకు
జనుల కభివృద్ధిఁ గల్గించుఁగనుక నెపుడుఁ
బరిణయంబును గౌరవింపంగవలయుఁ
బ్రతిపురంబున దైవతప్రాయముగను
గొల్వఁ దగుఁ గామదేవతఁ గోర్కిమీఱ. ౮౮

చ. ఘనుఁ డగుసింహకేతుఁ డిటు కాననసీమ కనంతశౌర్యవ
ర్ధనులు నిరంతరంబు నొకదారిగఁ జేరు టెఱింగి గొప్పసే
నను సమకూర్చుకొంచు జతనంబున సోదరుఁ బట్టి చంపఁగా
మనమున నెంచి వచ్చి కనును న్వసియించె వనోపసీమలోన్. ౮౯

అంతట—



చ. జడలును వల్కలంబులుఁ బొసంగ ధరించుమునీంద్రుఁ డొక్కఁ డీ
యడవిని గానిపించి పరమాద్భుతి జ్ఞానముఁ దెల్ప సింహకే
తుఁడు గదనంబునుండియును దోరపులోకమునుండియు న్విర
క్తుఁ డయి కిరీటముం దనకుఁ గూరిమిభ్రాత కొసంగ వానితో
నిడుములఁ గుందుభూపతుల కెల్ల స్వరాజ్యము లిచ్చెఁ బ్రీతితోన్. 90

ఈవార్త సత్య మని నాప్రాణము లొడ్డి చెప్పుచున్నాను.

సింహ—యువకుఁడా! నీకు స్వాగతము.

గీ. అగ్రజున కెల్లభూములు ననుజునకును
భూము లన్నియు నధికారపూజ్య మైన
రాజ్యమును బెండ్లి కుంకువ రంజిలంగ
నిచ్చినాఁడవు లోప మింకేమి కలదు? 91

ఇచ్చట నే చక్కఁగా నంకురించి ప్రారంభమైన కార్యములను జక్కఁగా నెఱవేర్చుకొందము, పిదప—

గీ. ఈవనంబున మాతోడ నెవ్వరెవ్వ
రెట్టికష్టంబులకును సహించినారొ
వారివారికి నాదగుభాగధేయ
మందుఁ దగు నంశములఁ జేతు నర్పణముగ. 92

ఈనూతనభాగ్యలాభమువలని సంతోషమును బ్రస్తుతము మఱచి యీవధూవరులందఱును, మనమును గలసి యీయాటవికసమాజమైన యానందమును బరిమాణింపశక్యముగానంత రాశీభూతమగువఱకు నాటపాటలతో ననుభవింతము.

ప్రియం—అయ్యా! మీయోర్పుతోడుగా మీవాక్యసారమును నేను సరిగా గ్రహించినయెడల మనరాజుగా రిప్పుడు వైభవములతోఁ గూడిన ధర్మాస

నము నుపేక్షించి కాషాయవస్త్రములతో దండకమండలువులు ధరించి రని తోఁచుచున్నది.

సౌమ్య—ఔ నటులే.

ప్రియం—అటులైన నాతనితో నేను నేగెదను. ఈమార్పును జెందినవీరందఱ వలనను దెలియందగిన విషయములు పెక్కులు గలవు. (రాజు నుద్దేశించి) మీసద్గుణసంపదయు, మీతితిక్షయు నందుల కర్హమైనవియే కావున మీ పూర్వగౌరవమును మీకుఁ జెందఁజేయుచున్నాను. (భీమబలు నుద్దేశించి) నీనిశ్చయమైన విశ్వాసమునకుఁ దగిన ప్రతిఫల మగు నీప్రేయసిని నీకు సమర్పించుచున్నాను. (ప్రద్యుమ్ను నుద్దేశించి) నీభూములను, నీభార్యను, నీగొప్పస్నేహితులను నీకర్పించుచున్నాను. (భద్రు నుద్దేశించి) నీశ్రమకుఁ దగినదీర్ఘమయిన శయనము నొసంగుచున్నాను. (విదూషకు నుద్దేశించి) రెండుమాసములవఱకే సరిపడిన పాథేయముగల యీవైవాహికయాత్ర యందు వాగ్వాదమునే సహాయముగా నిచ్చుచున్నాను. నీచిత్తమువచ్చి నట్లు పొమ్ము. ఈయాటపాటలు నాకుఁ బనికిరావు. (అని వెళ్లుట నభినయించును)

సింహ—ప్రియంవదుఁడా! ఆఁగు మాఁగుము.

ప్రియం—నే నీయాటపాటలను జూచి యానందించువాఁడను గాను. నీవు చెప్పఁదలఁచిన సంగతులను వినుటకు నీశిలాగారద్వారముకడ సిద్ధముగా నుందును.

(నిష్క్రమించును)

సింహ—కానిండు కానిండు. ఆటపాటల నారంభింతము. మన మనుకొని నట్లే యవి సంతోషముతో ముగింపఁబడఁగలవు.

(అల్పాహారభోజనము లొనర్తురు)



## ఉపసంహారము.

చారు—ఉపసంహారము స్త్రీచెప్పుట యాచారముకాదు. పురుషుఁడు చెప్పినను దీనికంటె నెక్కుడు గౌరవములోనిది కాదు. ఘనవస్తువులకుఁ బ్రకటన మనవసరమగుట నిజమైనయెడల మంచిరూపకమున కుపసంహార మనవసరము. అయినను ఘనవస్తువులుఁ గూడఁ బ్రకటింపంబడుచుండుటం బట్టి వరసరూపకములు గూడ నుపసంహారరూపమున వ్యక్తీకరింపఁబడిన యెడల వన్నెకెక్కును. నే నిప్పుడు కడు దుస్థితిలో నుంటిని. ఏమన నుపసంహారమును జెప్పుటకు బయికారణమున నే నర్హురాలను గాను. ఇది మంచినాటకమని మీహృదయముల రంజింపఁజేయఁ జాలను. ఇప్పటి నాయీభూమిక యాచార్యహ మైనది కాదు గావున నందుల కుపయోగింప నైతి. కావున నింక నాకు మిగిలినతెర యైంద్రజాలికవిద్యను మీపైఁ బ్రయోగించుటయే, ముందు స్త్రీలకొఱ కుపయోగించెదను. ఓసుందరీమణులారా! మీకుఁ బురుషులయెడఁ గలయనురాగము సాక్షిగా దీనిచే మీ మనంబుల కెంతసంతసంబు గలుగునో, యంత యానందింపుఁ డని మీ కాజ్ఞాపించుచున్నాను. ఓపురుషశ్రేష్ఠులారా! మీమందహాసములంబట్టి మీసుందరులయందుఁ బ్రేమానుబద్ధులై యున్నట్లు తోఁచుచున్నది. కావున నట్టియనురాగము సాక్షిగా నీనాటకము స్త్రీపురుషులకు సర్వవిధములచేతను గల్గుగాఢానురాగములను వృద్ధిఁ బొందించునుగాక! నేను నిజముగా స్త్రీనైనయెడల మీలో నాహృదయమును రంజింపఁజేయు చుబుకములు, సుందర మైనముఖవికాసములు, సుగంధపూరితము లైన శ్వాసములుఁ గల్గు పురుషుల నెల్లర నొక్కసారి ముద్దుపెట్టుకొని యుందును. కావున మనోహరము లయినచుబుకములును, సుందరాస్యములును, సుగంధశ్వాసములును గలమీ రందఱు నే ననుజ్ఞఁ గైకొనుచుంటిం గావున నీకు శుభమగుం గాక యని దీవింతు రని నమ్ముచున్నాను.

## భరతవాక్యము.

సూత్ర—

ఉ. అంచితకాంతులం దపనుఁ డస్తమయంబును బొందనట్టి దీ
ర్ఘాంచల మైనభూతలము నాతతనీతివివేకసద్యశ
స్సంచితపూర్ణరాజ్యధనసంపద లొప్పఁగ నేలుచున్న యా
పంచమజార్జిభూరమణభానున కుర్విజయంబు గావుతన్. 93

మ. మతము ల్పెక్కులు ప్రజ్వరిల్లి ఫలసన్మార్గాతిశూన్యస్థితిన్
వెతలం గుంది ధరాతలం బకట! నిర్వీర్యం బనాథత్వముం
బతితావస్థను బొందుచుండె నిఁక దేవా! దీని రక్షించి యే
గతి నేకేశ్వర మాభవన్మతముఁ బ్రఖ్యాతంబు గాఁ జేసెదో. 94

ఉ. ఉత్తరలోకసౌఖ్యముల నొందుటకై మతముం గ్రహించుచే
యుత్తమమై తనర్చు నిది యుక్త మయుక్త మి దంచు నెంచులో
కోత్తర మాస్వతంత్రత నహా! నరు లడ్డుట నీతిబాహ్య మీ
తత్తరపాటు మాన్పి ప్రజఁ దన్పుత మీశ్వరుఁ డెల్లకాలమున్. 95

## చారుమతీపరిణయము

సంపూర్ణము.

# ప్రకటన.

## శ్రీ రాజా భుజంగరాయ కవికృతగ్రంథములు.

| | రూ. | అ. | పై. |
|---|---|---|---|
| ఆధునికకవిజీవితములు. 500 పేజీలయుద్గ్రంథము - - - | 1 | 8 | 0 |
| శశిరేఖానాటకము. 6-వ కూర్పు - - - - - - - | 0 | 6 | 0 |
| అగ్గిరాముని మరణవేదన. అత్యద్భుతపుకథ - - - - | 0 | 2 | 6 |
| మైరావణుఁడు - - - - - - - - - | 0 | 2 | 6 |
| సంస్కృతభాషావాఙ్మయము - - - - - - - | 0 | 2 | 0 |
| ఆంధ్రభాషావాఙ్మయము - - - - - - - | 0 | 2 | [illegible] |
| గీతాంజలి - - - - - - - - - - | 0 | 1 | 0 |
| వసంతకుసుమము. విక్టోరియారాణిగారి చరిత్ర పద్యకావ్యము. | 0 | 8 | 0 |
| రావుబహాద్దర్ కందుకూరి వీరేశలింగముపంతులుగారి గ్రంథరచనాచాకచక్యము - - - - - - - | 0 | 2 | [illegible] |
| మనోరమ. చక్కనినవల (అచ్చులోనున్నది) - - - | 0 | 12 | [illegible] |

## క్రైస్తవమతగ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| మత్తయిసువార్త పద్యకావ్యము - - - - - - | 0 | 4 | 0 |
| మార్కుసువార్త పద్యకావ్యము - - - - - - | 0 | 4 | 0 |
| లూకాసువార్త పద్యకావ్యము - - - - - - | 0 | 4 | [illegible] |
| యోహానుసువార్త పద్యకావ్యము - - - - - - | 0 | 4 | [illegible] |
| అపోస్తలులకార్యములు పద్యకావ్యము - - - - - | 0 | [illegible] | [illegible] |
| రోమీయులు పద్యకావ్యము - - - - - - | 0 | [illegible] | 0 |
| క్రైస్తవ గూఢార్థప్రదీపిక వచనము - - - - - | 0 | 4 | 0 |
| The inner doctrines of Christianity - - | 0 | 8 | 0 |
| The power of Christ - - - - - - - | 0 | 2 | 0 |
| ప్రార్థన వచనము - - - - - - - - | 0 | 1 | 0 |
| ప్రవక్తలచరిత్ర, వచనము, (అచ్చులోనున్నది) - - - | 0 | 8 | 0 |

భారతీ వేర్‌హౌసు.
ఏలూరు, కృష్ణాజిల్లా.

BHARATHI WAREHOUSE
Ellore, Krishna Dt.

